# MRUTCHAKATIKAM.



(IN PROSE.)





D. V. AVADHANY.

శ్రీ

# మృచ్ఛకటికము.

శతావధానులు తిరుపతి వేంకటేశ్వరకవుల
తెనుగు నాటకము ననువదింపఁబడినది.








కాకినాడ:
శ్రీపతి ముద్రాక్షరశాల స్ముద్రితము.
1934

 వెల 0-12-0.

# ఉపోద్ఘాతము.



మధ్యమ తరగతుల విద్యార్థులు చదివి మహాకవుల యొక్క రచనలపై నుత్సాహము గల్పించుటకుఁ గాను వారి ములను సంగ్రహమొనర్చి వారి శైలినే యనుకరించుచు వ్రాయఁబడిన పఠనీయ గ్రంథము లాంగ్లభాష యందు వేన వేలు గలవు గాని మన యాంధ్రమున నం దట్టివి చాల తక్కువ. ఇట్టివి చదువుట వలన నా మహాకవుల కావ్యములందలి యితివృత్తము తెలిసి యుండుటచే నుత్సాహము కలిగియున్న రల బాలుర కవి సుబోధకములై యలరారును. పూర్వాధునాతన విద్వజ్జనుల గౌరవమున కాకరమై కల్పనాచాతుర్యమును జూపునట్టి దిట్టి దింకొకటి లేదని శూద్రకవిరచితమగు మృచ్ఛకటికము చాల ప్రసిద్ధి గాంచినది. దానికి శతావధానులు తిరుపతి వేంకటేశ్వరకవుల యాంధ్రీకరణము నాధారముగాఁ గైకొని వారి శైలి రుచిచూపుటకైఁ గొన్ని కొన్ని పద్యముల మధ్య నుదాహరింపుచు నీ కథ వ్రాయఁబడినది. పాఠశాలాధికారుల మన్నన కిది పాత్రమై మా ప్రయత్నము సఫలమగునని యాసించు చున్నాను.

ఇట్లు విధేయుఁడు,

కొల్లూరి సుబ్రహ్మణ్యం,

సంపాదకుఁడు.

కాకినాడ,
24-12-1934.

# మృచ్ఛకటికము.



## ప్రథమప్రకరణము.



సకల సంపత్సమృద్ధం బగునుజ్జయినీపురంబునఁ బూర్వకాలమునఁ బేదవడిన వ్యాపారియు సుగుణవంతుఁడును నగు చారుదత్తుఁ డను బ్రాహ్మణుఁడు కలఁడు. ఆతనిసుగుణంబు లనన్యలభ్యంబు లనిపొగడ్త కెక్కినవి. అందఱకును దలలోని నాలుకయై వర్తిలునట్టి యాబ్రాహ్మణుఁ డర్థకల్యవర్తక మొనరించి దైవవశమునఁ బూర్వార్జిత మంతయుఁ గోలుపోయి దరిద్రుఁడై యవయుచుండెను. కలిమి గలనాఁడు చుట్టును మూఁగినవారు లేమి వచ్చుటతోడనే మదము లేనట్టిదంతి చెంత కైనను రాకుండఁ ద్యజించుతుమ్మెదలపగిది నాతని విడనాడిరి. జగత్తు ధనమూలము. కాని వదాన్యుఁడును గుణవంతుఁడును నగుటచే నాతని కీర్తి కేకొదవయును రాలేదు. కళలన్నియును దేవతల కిచ్చినచంద్రునిక్షయమువలె నాతఁడును దారిద్ర్యముచేఁ దేజమును వాసియు సర్వజనపూజ్యత నంది యుండెను.

ఆపట్టణంబున నాగ్రికలావతంస మై బోగముకొలములో జనించినను సాటిరోబోటులకితి సర్వజనవశ్యురాలు కాక సుగుణముల కాల వాల మై చక్కఁదనమున వసంతసేనం బోలు వసంతసేన యను నొకవారకాంత గలదు. ఆమెయుఁ జారుదత్తునిగుణగణముల నాలించి యామహానుభావునిదర్శన మెట్లొనర్తునా యని సందేహించుచు మనమునందలి కోరిక నానాఁటికి ద్విగుణీకృత మగుచుండ నొకనాఁడు చెలికత్తెతోఁగూడఁ గామదేవాలయంబునకుఁ బోయి యచ్చటఁ జారుదత్తుని గాంచి యాతనియందమునకు ముగ్ధురాలై సుగుణముల నీవఱకే విని యున్న దగుటచే దరిద్రుఁ డనియైన బాటింపక వరించినది.

వసంతసేనకుఁ జారుదత్తునిపై ననురాగము దినదినాభివృద్ధిఁ గాంచుచుండెను. ఇట్లుండఁ గొంతకాలము గడచిపోయెను. ఒకనాఁటిసాయంసమయమున సంధ్యావందనాదికముల ముగించి చారుదత్తునకు సార్వకాలికమిత్రుఁ డగుమైత్రేయుఁ డాసమయమ్మున కరుదెంచి చూర్ణవృద్ధుఁ డనునొక స్నేహితుఁడు పంపినాఁ డని చెప్పి జాజిపూవులతావులఁ గ్రమ్మునుత్తరీయము నిచ్చెను. అదివఱకు వేలకొలఁది ధనార్థులకు ధనంబు నన్నార్థుల కన్నమును నితరకామ్యములు గోరినవారికి వారి వారికోరికల నొసంగిన యాచారుదత్తుఁ డది గ్రహించి నేఁటికి దైవము నాకిట్టిదుర్దశ ఘటించెఁ గదా యని యూర్పుచ్చసాగెను. పురుషునకు దారిద్ర్యము దుర్భర మైనది.

ఉ. చేరిక చింతకున్ బరులు సేయుతిరస్కృతి బంధుకోటికిన్
దూరము వైరి లేనిపగ, దోహద మాఱనిశోకవహ్నికిన్
దారల కీసడింపు విపినంబులపా లగు బుద్ధి బంధువుల్
చేరనిదారి లోపలికిఁ జేరియుఁ జంపనిచిచ్చు కాదొకో?

శా. దారిద్ర్యంబున సిగ్గు గల్గుఁ ద్రపచేతన్ దేజమున్ బోవుఁ
దే, జోరాహిత్యమునన్ బరాభవము వచ్చున్ దాన
నిర్వేద మే, పారున్ దాన జనించు వంత మతి వమ్మై పోవు
దుఃఖమ్మునన్, గారించున్ మతిలేమి లేమి సకలా నర్థప్రదం
బకటా!

గీ. మరణమందును దారిద్ర్య భరమునందు
మరణమే మేలు దారిద్ర్య భరముకంటెఁ
దత్సమయమాత్రదుఃఖప్ర దంబు చావు
చచ్చినందాఁక దుఃఖ మొసంగు లేమి.

కొంతసే పాపరానిదుఃఖవేశంబునకు లోఁగి యాతఁడు మైత్రేయుని బిలిచి గ్రామదేవతలకు బలి యొసంగి రమ్మని కోరెను. మైత్రేయుఁడు తనవంటి బ్రాహ్మణుఁ డేదిచేయఁబోయినను నద్దములోఁ గుడివై పెడమ నెడమ కుడివై పుగాఁ గాన్పించునట్లు విపరీతముగాఁ దోఁచు ననియు, రాజవీథులలోఁ బ్రదోషసమయముల విటులు, వేశ్యాకాంతలు, రాజానుగ్రహము గల పురుషులు దిరుగాడుచుందు రనియుఁ, దనకుఁ బట్టపవలే వీథిల

నికిఁ బోవుట భయ మగుటచే నిట్టిసమయమున నెవరిచే నైనఁ జావు మూడు ననియు గారణములు చెప్పి బలిని దీసికొని పోవుటకు నిరాకరించెను. చారుదత్తుఁడును గొంతకాల ముండి తానే తీసికొని పోవచ్చు నని సమాధాని నిర్వర్తించుకొనుటకాయత్తుఁ డయ్యెను.

సరిగ నీసమయంబునకే వసంతసేన సర్వాభరణభూషితురాలై రాజమార్గమున విలాసార్థము బయలుదేఱినది. ఆకాలమున నుజ్జయినీనగరంబును బాలించుచుండిన పాలకమహారాజునకు శ్యాలకుఁడు శకారుఁ డనువాఁడు కలఁడు వీఁడు పరమదుర్మార్గులలో నగ్రగణ్యుఁ డని పే రొంది తన కెదు రైనవారి నకారణముగ నదలించుచు సర్వజనకంటకుఁ డై వర్తించు చుండెను. ఈదుర్మార్గుఁడు వసంతసేనయందచందముల రోసి కామాతురుఁ డై తత్సమాగమంబునకు వివిధోపాయముల నారయుచుండెను. రాజమార్గమునఁ బడి వచ్చుచున్నవసంతసేన నీక్షించి తగినయదను నబ్బె నని సంతసించుచు విటచేటులతోఁ గలిసి యామెను దఱుముకొని రాసాగెను. నోటికి వచ్చినట్లెల్లఁ బ్రేలుచు నాశకాత్ములామెవెంట నంటిరి. ఆమె యబలను గాన రక్షింపు మని వేఁడుకొనెను. అందుచేతనే పోషింపఁబడుట కర్హురాలవు కావున మా శకారుని జెట్టఁబట్ట వలయు నని విటుఁడు సమాధాన మిచ్చెను. అందుచేతనే చంపఁబడ లే దని శకారుఁడు ప్రత్యుత్తర మొసంగెను. ఆమెయు బోయవానిని జూచి యడలుసారసాంగనవలెఁ

బులిని జూచి యాక్రందన మొనరించునాపుకీతి దన్ను రక్షించు వారు లెవ్వరును దాపున లేమికిఁ జింతింపుచుఁ గొంచెము ధైర్యము నవహించి మీరు దొంగ లైనచో నామేన నమూల్యములగు రత్నాభరణము లున్నవి వీని నన్నిటిని గ్రహించి నన్ను విడిచిపుచ్చుఁ డని కేలు మోడ్చి ప్రార్థించెను. విటుఁడును మేము సరసులమే కాని దుర్మార్గులము కాదనియు, నుద్యానలతకుఁ బూవులు ద్రెంచుకతిను లూడ రనియు వసంతుచే నామె నగల కాసించువారము కామనియు బదు లిచ్చెను. శకారుఁడును నేను వరపురుషమనుష్యుఁ డను గావున నన్నుఁ గామింపుమని యామెపాదములపైఁ బడి ప్రార్థించెను. వసంతసేన యనురాగమునకు యోగ్యతకారణము గాని బలాత్కారము కాదనియుఁ దనమేనఁ బ్రాణము లుండఁగ నిన్నుఁ గామించుదానను గా ననియుఁ జెప్పి వాని నావలకుఁ ద్రోసివైచెను.

మ. కలిగెం బో భువి అంకుగూడెములు మాకై సుంత యోజిం
పుమా, వెలప్రోయాలవు కావటే పథిభవోర్వీజంబు చందం
బుగా, వెలచేతన్ గొనఁ దగ్గ దీయొడలు నీవే లంజవా
యందఱిన్ వల పున్నన్ వల పుండకున్న సమభావం బొప్ప
సేవింపుమా !

అని యుపన్యసించుచు, నామె నిరసించినందుకు శకారుఁడు మండిపడి యెట్లైన నామె నానాఁడు బంధించితీరవలర

నని నిశ్చయించుకొని, కామదేవాలయములో నీగర్భదాసి యాదరిద్రచారుదత్తుని జూచినది మొదలాతనిపైఁ దనమానసమును లగ్నము చేసి యున్నదని చారుదత్తుని యిల్లెడమవైపున నుండుటచే నామె తప్పించుకొని పోకుండఁ జూడవలయు నని విటశకారులను హెచ్చరించెను. ఈనిర్భాగ్యుఁడేది తెల్పరానిదో యదియే తెల్పినాఁడని విటుఁడు వగచెను. అపకారము జేయఁదలఁచినను దన కుపకారమే యైనదని వసంతసేన సంతసించుచుఁ జారుదత్తునియింటిగుమ్మము సమీపించెను గాని తలుపులు మూసి యున్నవి. అంతట శకారుఁడును వసంతసేన దాల్చినపూవులతావియు నామె ధరించినభూషణముల గలగలధ్వనియు గుర్తుగ నాచీఁకటిలో నామెను బట్టుకొనుటకుఁ బ్రయత్న మొనరించుచుండ నీవ్యాపార మంతయు మొదటినుండియుఁ దన కిష్టము లేనివాఁడగుటచేతను స్వతస్సిద్ధముగఁ గొంతవఱకుఁ గరుణామూర్తియు నగుటచే విటుఁడు వసంతసేన నెట్లైన రక్షింపఁ దలఁచి యన్యాపదేశముగా నామె కెఱిఁగించెను. వసంతసేనయు నతఁడు చెప్పినదానియర్థమును గ్రహించి పూవులఁ దీసి పాఱవైచి మేనిభూషణంబులు సడలించి లోలో విటునకుఁ గృతజ్ఞతాపూర్వకవందనంబు లర్పించి యేదేవునిదయచే నైన నేపుణ్యాత్ము లైనఁ దలుపు దెఱచిన బాగుగ నుండు నని యనుకొనుచుఁ జకిత యై యాద్వారసమీపమున నిలిచి యుండెను.

చారుదత్తుఁ డింతలో జపము ముగించుకొని గ్రామదేవతలకు బలి తీసికొనిపొమ్మని మైత్రేయుని మరలఁ గోరుకొనెను. మైత్రేయుఁడు మరలఁ బూర్వకారణములనే చెప్పి పోవ నిరాకరించెను. సార్వకాలికమిత్రుఁ డగు మైత్రేయుఁడు గూడ తన మాట వినకుండుటకుఁ దనఘోరదారిద్ర్యము గదా హేతువని,

గీ. మాట విన రింటిచుట్టాలు మాఱుమొగముఁ
వెట్టుదురు మిత్రు, లాపద ల్పెరుఁగుఁగాంతి
వాయు, శీలంబు తఱుఁగుఁ, బైఁబడు నితరుల
పాపకృత్యంబులును బేదవాని కకట !

గీ. సుహృద మని యెంచి నాలోనఁ జొచ్చి తీవు
మందభాగ్యుండ నగునేను మడియునాఁడు
ఘోరదారిద్ర్యమా ! యేమి దారి నీకు ?
నిన్నుఁ గూర్చి విచారించుచున్నవాఁడ.

అనియుఁ జింతింపుచుండ మైత్రేయుఁ డింక నాతనిచిత్తమునకు నొప్పి కలిగించుట భావ్యము కా దని యెట్టకేలకు బలి తీసికొనిపోవుటకు సమ్మతించెను. మహాశూరుఁడు గావున నాబ్రాహ్మణుఁడు రదనిక యనుపరిచారికను దోడు గైకొని, బలియును దీపము నామెచేతి కిచ్చి తాను తలుపుగడియఁ దెఱచెను. వసంతసేన యాతురతతోఁ జూచుచున్నది కావునఁ దలుపు తెఱువఁబడుటకు సంతసించి దీపపువెలుఁగునఁ దాన

శకారాదులకుఁ గాన్పింతు ననుభయమునఁ జైటకొంగుతో నాదీపము నార్పివైచి లోనికిఁ బ్రవేశించెను. గాలివలన దీప మారిపోయిన దనుకొని మైత్రేయుఁడు మరల దీపమును వెలిఁగించుకొనివచ్చుటకై రదనికను వీధిలో నిలిపి తాను లోపలికిఁ బోయెను. ఈలోపున శకారాదులు వసంతసేనను వెదకికొనుచు నాతావునకు వచ్చి రదనికను జుట్టుముట్టిరి.

మైత్రేయుఁ డనంతరము దీపము వెలిగించి తెచ్చినతోడనే శకారాదులు తమతప్పుఁ దెలిసికొని రదనికను విడిచిపుచ్చిరి. శకారాదులు రాజస్యాలకునితో విరోధము ముప్పునకు హేతువనియు, వసంతసేనను స్వయముగాఁ దెచ్చియిచ్చిన బ్రతుకు దువు లేదేని నీవినాశము తప్ప దని చారుదత్తున కెఱిఁగింపు మని మైత్రేయునితోఁ బల్కి వెడలిపోయిరి.

గాలికొఱకుఁ జారుదత్తునికుమారుఁ డగురోహసేనుఁడు బయటఁ బరుండెను. చారుదత్తుఁడు లోనికిఁ బ్రవేశించిన వసంతసేనను సరిగ గుర్తించ లేక రదనిక యనుకొని తనకుమారుని లోపలఁ బరుండఁబెట్టి చూర్ణవృద్ధుఁ డొసంగిన యుత్తరీయమును జలి వేయకుండఁ గప్పుమని యామెచేతి కొసంగెను. వసంతసేనయు జాజి పూలతావులఁ గ్రమ్ముచున్నయాయుత్తరీయమును నేను రదనికను గా నని తెల్పలేక చేతఁ బుచ్చుకొని చారుదత్తునియంగస్పర్శ మైనట్లు మహానందతరంగముల నోలాడుచు

లోపలికిం బోందగనినిర్భాగ్యురాల నైతిం గదా యని విచారించుచు మాఱు వల్కక చిత్రప్రతిమవోలె నట్లే నిలువంబడి యుండెను. చారుదత్తుండు పరిజనముగూడం దాను చెప్పినమాటలు వినకుండునంతటిదుర్భరస్థితికి వచ్చితిని గదా యని విచారించుచుండెను.

మైత్రేయుండును బలికర్మ యథోచితముగ నిర్వర్తించి తిరిగి వచ్చి విచారించుచున్న చారుదత్తుని గాంచి యామె రదనిక గాదనియు, వసంతసేన యనియుం దెల్పి వీథియందు జరిగిన వృత్తాంత మంతయు నెఱిగించెను. కొంతసేపు వార లన్యోన్యభావతరంగక్షుభితమనస్కులై మాట లాడలేకపోయిరి. తరువాతం జారుదత్తుండు తెలియక పరిచారికకుం జెప్పవలసినపనికి నియోగించితి నని వసంతసేనను క్షమింపు మని వేడుకొనెను. ప్రదోషసమయమున ననుచితవేషముతో వీథి కెక్కినందులకుం దానే క్షమ్యురాల నని వసంతసేన యనెను. పిదప నొకరికొక రభివాదనములు చేసికొనిరి. ఈసమావేశమూలమునం జారుదత్తునకు వసంతసేనపైం బ్రేమ యంకురించెను. అదివఱకే ప్రేమించి యున్నవసంతసేన కాతనియందు వలపు ద్విగుణీకృత మయ్యెను.

ప్రొద్దు పోవుచున్నది కావున నిఁక నింటికిం బోవుట యుక్త మని తలపోసి రాత్రిసమయమున రాజమార్గమున నొంటరిగం బోవుట భయహేతువు కాన సువర్ణభాండ మను తనన

భద్రముగ దాఁచి యుంచవలయు నని చారుదత్తునిచేతి కామె దాని నొసంగెను. కూడ సాయము బోవఁ దలంచి చారుదత్తుఁడు రాజమార్గములోఁ బెద్దమనుష్యులు తీసికొనిపోఁ దగిన దీపమును దెమ్మని వర్ధమానకున కాజ్ఞాపించెను. సేవకుఁ డగువర్ధమాన కుఁడును బ్రతి చెప్పనేరక డబ్బంతయు నపహరించి కాముకుల నావలకుఁ బాఱఁద్రోలు భోగములంజెలవలె దీపములన్నియును స్నేహశూన్యము లయ్యె నని విచారింపసాగెను ఇంతలో దైవానుగ్రహము వలన గ్రహగణముతోఁ గూడ రాజ మార్గప్రదీపమో యనునట్లు చంద్రుఁ డుదయింపఁ బలపలని పంకమునందుఁ బడుపాలవలె నాతనికాంతి చీఁకటులయందుఁ బడ సాగెను. చారుదత్తమైత్రేయు లిరువురును వసంతసేన నింటి వఱకు సాగనంపి మఱలి వచ్చి యామె తమచేతికి దాఁచ నిచ్చినసువర్ణభాండమును బవలు వర్ధమానకుఁడును రాత్రులు మైత్రేయుఁడును జాగ్రత్త పెట్టుటకు నిర్ణయించుకొనిరి.

# మృచ్ఛకటికము.



## ద్వితీయప్రకరణము.



అనంగదేవుని యాదేశము క్రమముగా వసంతసేన కొదల కెక్కినది. చారుదత్తసంస్మరణము తప్ప నన్య మేమియు నామెకు రుచింప దయ్యెను. స్నానము జేసి దేవతాపూజఁ జేసికొమ్మని కబురంపినతల్లి కీనాఁడు నేను స్నానము చేయను. బ్రాహ్మణులుచేతనే పూజఁ జేయింపు మని సమాధాన మిచ్చి చెలికత్తె యగుమదనికతోఁగూడఁ జారుదత్తుని గూర్చి యిష్టాగోష్ఠిగ మాటలాడుచుఁ గూర్చొని యుండెను.

అపుడు వారి కీక్రిందివిధముగ సంభాషణ ప్రవర్తించినది.

మద—అమ్మా! చారుదత్తుఁడు దరిద్రుఁడు గద వాని నెట్లు వలచితివి ?

వసం—దరిద్రుఁ డైన నేమి ? ఆమహామహునిగుణగణములను జూచి వరించనివా రెవ్వరు ?

మద—పూవులు లేనిమామిడిచెట్టుమీఁది కాఁడుతుమ్మెదలు పోవునా ?

వస—అవి మధుకరులు కావునఁ బోవు.

మద—చెలీ ! అంతటివల పున్న వానినే యిచటికి రప్పించు కొనలేకపోయితివా ?

వసం—ఆలోచింపకుండ నేకార్యమును జేయరాదు.

మద—నీకు సందేహ మెందులకు ? ఎంతేమందివారకామినుల యిండ్ల కెందఱువిటు లిట్లు వచ్చుచుండుట లేదు.

వసం—ప్రత్యుపకారము జేయఁజాల ననుసందేహముతో నామహాభావుఁడు కంటికే కానుపింపఁ డేమో ?

మద—అదియును నిజమే !

ఇట్లు వా రిరువురును బ్రస్తావించుకొనుచుండ మాథురుఁ డనుసభికునితోడను నింకొక జూదగానితోడను, జూదమాడి సంవాహకుఁ డనువాఁ డొకఁడు వారికిఁ బదిసుర్ణము లప్పుపడి పాఱిపోవుచుండెను. మాథురుఁడును జూదగాఁడును

గీ. జూదరికొలంబునకునెల్ల వాదుదెచ్చి
పాఱిపోయెద వేలరా పాపి ! భీతి
నొడలువడఁకగ నింక దురోదర గృహ
మునకుఁ జను దెంతె సభికుని మోసపుచ్చి.

అని కేకలు వేయుచు, వానిని బట్టుకొనుటకు వెన్నంటిరి.

సంవాహకుఁడు భయపడి వారిబారినుండి తప్పించుకొనుట కెవ రునడకతో నొక శూన్యదేవాలయముఁ జొచ్చి యం దున్న విగ్రహము వెనుక దాఁగి యుండెను. సంవాహకుని దఱుము కొని వచ్చుచున్న యాజూదరు లిరువురుఁగూడ నాశూన్యదేవా లయమును బ్రవేశించి యం దాతఁడు విగ్రహము వెనుక దాఁగి యుండుటఁ బసికట్టి వాని నవలకు లాగునుద్దేశముతో మరల జూద మాడ నారంభించిరి. సంవాహకునకుఁ బాచికలరొద యావేశముఁ గల్గించెను.

గీ. రాజ్యమును గోలుపోయిన రాజుమనము
భేరికాధ్వని వోలెఁ గంపింపఁజేయు
నాస పుట్టించి జూదంబు నందు ధనము
చెడినవానికి మరలఁ బాచికలరొదయు.

గీ. పైఁడికొండనుండి పడద్రోయు నెక్కించు
జూద మెప్పు డాడ రాదటంచు
నొట్టు పెట్టుకొనియు నుడుఁగఁడు కోకిలా
రవముఁ బోలు నక్షరవము విన్న.

కొంత కాలమువరకు నీవలకు రాకుండ మనస్సును బిగించు కొనెఁ గాని సంవాహకుఁ డిక నాసక్తి న పుకొనలేక పోయెను. వారిర్వురును బందెముల నొడ్డుచుండ సంవాహకుండు నీదియుఁ గాదు నీదియుఁ గాదు నావి పందె మనుచుఁ బరువెత్తుకొని

వచ్చెను. అంతట వారిరువురును సంవాహకుని బట్టుకొని యీయవలసినపదిసువర్ణముల కొఱకు నిర్బంధించి పలువిధముల బాధ పెట్టఁ దొడఁగిరి. ఇంతలో దర్దురుఁ డను నింకొక సభికుఁడు సంవాహకునియవస్థ గాంచి కొంచెము జాలి వడియెను.

ఉ. కివ్వనకుండ వీఁపు తలక్రిందుగఁ జెట్లపయిన్ భయమ్మునన్
గొమ్మలలోన డాఁగెఁ బడఁగ్రుద్దినఁ గాయలు కాచెవీపు
నిక్కమ్ముగఁ బిక్కలందు శునకమ్ములచేఁ గఱపించి రిన్నిభం
గమ్ములు డబ్బుకై పడియు, గ్రమ్మఱ వచ్చెను జూద మాడఁగన్.

అని చింతించుచుఁ దానుగూడ నట్టియవస్థ కిదివఱ కనేకసారులు పాల్పడి యున్నవాఁ డగుటచే సంవాహకు నెట్లైన రక్షింపఁ దలఁచి మాథురునియొద్దకుఁ బోయి యనేకవిధముల బ్రతిమాలుకొనియెను. కాని మాథురుఁడు వినిపించుకొనలేదు. అందుచే వానితో గలహముఁ బెంచి యీసందున మాథురునికన్నులలో నిసుక జల్లి పాఱిపొమ్మని సంవాహకునకు సంజ్ఞ చేసెను. సంవాహకుఁడును జెప్పినట్లే చేసి తనప్రాణములను రక్షించుకొనుటకై వసంతసేనయింటికి దారితీసెను. దర్దురకుఁడు ప్రధానసభికునితోఁ గలహముఁ దెచ్చిపెట్టుకొనుటచే నచట నిలుచుట యపాయకరమనియు నార్యకుఁ డను గొల్లపిల్లవాఁ డొకఁడు ముందు రాజగునని సిద్ధుఁ డొకఁడు తెల్పుటచేఁ దనవారందఱ తోఁ

పాలబాలు నాశ్రయించుచుండి రనియు నందువలనఁ దాను గూడ వానియొద్దకే పోయెద ననియు నిశ్చయించెను.

సంవాహకుఁడును మెల్లఁగ వసంతసేనయెదుటకుఁ బోయి భయకారణము నెఱుఁగనియామెతోఁ దాను పుట్టినది పాటలీపుత్రమనియు సంవాహకవృత్తిచే జీవించుచు నార్యచారుదత్తుని యొద్ద గొలువునకుఁ గుదిరి మంచినీళ్ల చెఱువులో నీళ్లు మిగులని పగిది నాతనిధన మంతయుఁ బోయి దరిద్రుఁ డైనతరువాత జూదమును జేపట్టి యదృష్టము లేమిచేఁ బదిసువర్ణము లప్పు వడితి ననియు వారు తీర్చవలయు నని నిర్బంధించి బాధించుచుండుటచే నామెముఱుగుఁ జొచ్చితి ననియుఁ దెల్పుకొనెను. వసంతసేనయు నొకయప్పుడు చారుదత్తుని సేవకుఁ డగుటచేఁ దన కాతఁ డాత్మీయుఁ డని తలఁచి సంవాహకుఁడే యిచి నట్లు జూదకుల కీయవలయు నని పదిసువర్ణముల క్రిందఁ దన చేతిమురుగు నొకటి తీసి మదనికచేతి కిచ్చెను. సంవాహకుఁడును గండము గడచినందుల కెంతయును సంతోషించి యిఁక ముందు జూద మాడ నని యొట్టు పెట్టుకొని బౌద్ధసన్యాసి నయ్యెద ననియు సంవాహకుఁడు బౌద్ధసన్యాసి యయ్యె నను మాట మఱవవల దనియుఁ జెప్పి వసంతసేనకడ సెలవు గైకొని వెడలి పోయెను.

పిదపఁ గర్ణపూరకుఁ డను వసంతసేన మావటీఁడు రభసముగాఁ బ్రవేశించి ఖుంటమోదక మను కట్టుఁగొయ్యఁ బెకలించు

కొని మావటీని జంపి విశృంఖలముగాఁ దిరుగుచుఁ గాళ్లచే ను దొండముచేతను వికసించినపద్మమునువలె నుజ్జయినీపురము నంతయుఁ బాడొనర్చుచుండ దానికిఁ బ్రారబ్ధవశమున నొక బౌద్ధసన్యాసి యెదురయ్యె ననియు నంతట నాయేనిక వాని దండకమండలువులఁ బోనడంచి శీకరముల మొగమునిండఁ జిమ్ముచు దంతములసందున వాని నిఱికించుకొని పోవుచుండ జనులందఱును సన్యాసి చచ్చెఁ జచ్చె నను యాక్రందనము లొనర్చుచుండఁ జెంత నంగడిలో నున్న తా నది యాలించి యొకయినుపకోలను దెచ్చి దానిని బడమొత్తి సన్యాసిజీవము లను గాపాడితి ననియుఁ దరువాత నాజనసమూహములో నున్నయొకపుణ్యాత్ముఁడు తనదరికి వచ్చి యొడ లంతయుఁ దడివికొని యొక్కనగ యైనను లేకుండుటకు సిగ్గువడి పై నున్న యుత్తరీయమును బహూమతి యొసంగినాఁ డనియుఁ దెల్పెను. అంతటివదాన్యుఁడు చారుదత్తుఁడు తప్ప నింకొకఁడు లేకుండుటచే నాయుత్తరీయము చారుదత్తునిదే యని వసంతసేన నిర్ణయించుకొని కర్ణపూరకునియొద్దనుండి లేనగ యొకటి తీసి యిచ్చి యాయుతరీయమును విలిచి ప్రేమసూచకముగాఁ దన యొడలిపైఁ గప్పుకొనెను. పిదపఁ జారుదత్తుఁ డింకను వీథియం దేగుచుండెనేమో తనివారఁ జూడవలెయు నని మదనికతోఁ గూడఁ బ్రాసాదాగ్రభాగమునకుఁ బోయెను.

---

# మృచ్ఛకటికము.



## తృతీయప్రకరణము.



నాఁటిరాత్రి చారుదత్తమైత్రేయు లిరువురును రేభిలుని యింటికి సంగీతము వినుట కేగి నడిరేయి దాఁటిన పిమ్మట స్వగృహమ్మునకే తెంచిరి. సంగీతము సర్వజనరంజక మైనది. గానమాధుర్యమునకుఁ గఱఁగనివాఁడు రాక్షసావతార మని చెప్ప నొప్పును. సర్వసాధారణముగ నాలకాఁపరులు పాడు గాలిపాటలకే పశువులుగూడఁ జెవులు నిక్కించుకొని యాలించు చుండును. శాస్త్ర మెఱింగినవాఁడై మనోరంజక మగుగాత్ర మాధురి గలరేభిలునిపాటకుఁ జారుదత్తమైత్రేయులు తన్మయు లగుట వింత కాదు. ఇంటి కేతెంచిన తరువాతఁ గొంతసేపటి వఱకుఁగూడ.

మ. ఎదుటన్ వర్తిలుకాంత పో విరహవహ్నిన్ గ్రాఁగుచో
గేహాకిన్, మది కింపైనవయస్యు సుమ్ము వలవంతన్గుందుచోఁ
గామికిన్, ముద మిచ్చున్ బ్రియవిప్రలబ్ధయయి వ్యామో

హించుచోఁ గాంతకున్, మదనాటోపము వెంచు నౌషధము
సుమ్మా యీగృహస్థాళికిన్.

అని గానమాహాత్మ్యమును వర్ణించుకొనుచు శయ్యలపై నొఱిగిరి. వెనుకఁ జేసికొనినసమయముప్రకారము సువర్ణభాండమును దాఁచుట రాత్రులయందు మైత్రేయుని వంతు. అందుచేతఁ బగటు వర్ధమానకునిచేతికి దాఁచ నిచ్చినసువర్ణభాండమును మైత్రేయుఁడు పుచ్చుకొనెను.

శర్విలకుఁ డనుదొంగయొకఁడు వసంతసేన యొక్క దాసి యగుమదనికను బ్రేమించెను. కాని యామెను దాస్యమునుండి విముక్తి సేయుటకుఁ దగినధన మాతనియొద్ద లేదు. మదనికపైఁ గలవ్యామోహము తొలఁగఁద్రోయుటకు వీలు కానంత బలముగఁ దల కెక్కినది. ఆతఁ డేమి సేయుటకును దోఁచక చౌర్యముచే నెవరియింటనైనఁ దగుమాత్రము ద్రవ్యమును సంగ్రహించి వసంతసేన కాధన మొసంగి మదనిక నామె దాస్యమునుండి విముక్తి సేయునుద్దేశముతో నాఁటిరాత్రి చారుదత్తభట్టారకుని యింటికిఁ జేరుకొనియెను. ఆతఁ డాఱితేఱినదొంగ. వృక్షవాటికాసమీపమునఁ జుట్టు ప్రహరికిఁ గన్నము ద్రవ్వి లోనికిఁ బ్రవేశించి నాలుగిండ్ల ముంగిటిలోనికి దూఱుటకుఁ దగినకన్నముఁ ద్రవ్వనెంచి,

చ. తడిసినచోటు క్రక్కదలఁ ద్రవ్వినఁ జప్పుడు కానిచోటు నె
వ్వఁడుగనుగోనిచోటు, సులభంబుగ సంధికిఁ బెద్దరూప మే

ర్పడఁ గలచోటు చౌడురలిరాలెడుచోటును మేలు స్త్రీలు క
న్పడని ప్రదేశమున్ మిగులఁ బాడగుమేడయుఁ గార్యసిద్ధికిన్.

అని తనగురువుగా రాదేశించినప్రకార మట్టిచోటు కన్పట్టుటకు సంతసించి, భగవంతుఁ డగు కనకశక్తి "పండిటిక లూడఁ దీయుము; పచ్చియిటికలు పగులఁగొట్టుము; మంటిముద్దలగోడ తడుపుము; బల్లలకూర్పు చీల్చు" మని నుడివి యుండుటచే నదియును బంకిటికలగోడ కావున నిటికె లూడఁదీయుటకు నిశ్చయించుకొని యేడువిధము లగుకర్మమార్గములయందును బూర్ణకుంభనామధేయ మగుసారంగమును ద్రవ్వఁ బూనుకొనియెను. మున్ముందు చౌర్యవిద్యకు గురువు లగు కుమారకార్తికేయులకు నమస్కరించి యోగరోచన యనువిద్య తనకుఁ బ్రసాదించి యొరులకంటి కగుపడకుండ ననుగ్రహించిన యోగాచార్యగురుచరణారవిందములకు సాగిలి మ్రొక్కెను. కన్నముఁ గొలుచుటకుఁ గొలదారమును మఱచిపోయి నందుల కొక్కింత విసువుకొనుచు బ్రాహ్మణుఁడు కావున యజ్ఞోపవీతమును జూచికొని,

గీ. దీనిచేఁదల్పుగడెలూడఁ దీయవచ్చు
దీనిచే సీల నగలకుఁ ద్రిప్ప వచ్చు
దీనిచేఁ గొల్వవచ్చు భిత్తికి సురంగ
దీనిచేఁ బామువిషమును దింపవచ్చు.

అని నిశ్చయించుకొని ప్రమాణ మేర్పఱచుకొని క్రమముగఁ

గన్నముఁ ద్రవ్వ నారంభించెను. ఒక యిటిక వరుస మాత్రమే మిగిలినది. ఇంతలోఁ బాము కాఁబోలు కఱచెను. విషము పై కెక్క సాగెను. ఓర్వ లేనంత బాధ కలుగుచున్నను బైకి మాత్ర మొరలకుఁ దెలియు నను భీతిచే మూల్గనైన మూల్గక జందెము వాడఁ దీసి వ్రేలికి గట్టిగఁ జుట్టుఁ బెట్టుకొని విష బాధకుఁ దగిన చికిత్స గావించి మిగిలిన కన్నమును గూడఁ బూర్తి కావించెను. లోపలి దీపపు వెలుఁగు పైకిఁ బ్రసరించుచుండెను. పై వారల కెవ్వరికిని దాను కాన్పింపకుండ జాగ్రత్తపడి లోనికిఁ బ్రవేశించెను.

చారుదత్తమైత్రేయు లిర్వురును నిద్రించుచుండిరి. కాని యీసంగతి రూఢిగ శర్విలకునకుఁ దెలియదు. అందుచే మొదట శరీరసంరక్షణార్థము తలుపులన్నియుఁ దెఱవఁబోయి యందొకటి కిఱ్ఱుమనుచుండుటచే నీళ్లు జల్లి వీపు తలుపున కానించి యుతక నెత్తివైచెను. అనంతరము చారుదత్తమైత్రేయులు నిజముగ నిద్రించుచుండిరో లేదో పరీక్షించి యిట్లు నిర్ణయించుకొనెను.

చ. గుఱకసమాంతరంబగుచుఁ గొంకక వెల్వడుఁ గంటిరెప్పలుం
దఱుగవు హెచ్చు వింతయును దారకలల్లలనాడ వంగముల్
పఱచినశయ్యదాఁటి వికలత్వముఁ జెందిన విట్టులుండ ముం
దఱఁగల దీపకాంతి నయనంబులు సైఁచునె దొంగనిద్రకున్.

వారు గాఢ నిద్రలోనున్నట్లు నిర్ధారణచేసికొనిన పిదప శర్విలకుఁ

డిల్లునాలుగుమూలలుఁ గలయఁజూచెను. తా నేపనికై వచ్చెనో యందులకుఁ దగిన వస్తువులేవియు నాతని కంటికిఁ గాన్పించ లేదు. ఒక వైపువీణె, యొకవెపు మద్దెల, యింకొకవెపు పణవము, నొక మూలఁ బిల్లనగ్రోవి, యింకొక మూల దర్దుర మునుగాంచి నాట్యాచారుని యిల్లై యుండునేమో యనియు నింటి గొప్ప చూచి మోసపోయితి ననియుఁ జింతించి మరల ధైర్యము తెచ్చుకొని నాల్గుమూలలను విత్తులు జల్లి మొలక లెత్తుటను మొలవకుండుటచే ధనము భూగర్భితము కాలేదని నిశ్చయించుకొని శుద్ధ దరిద్రుని యింటికి నాగ్రహచారమునకుఁ దగిన ట్లేతెంచితి నని కుందుచు వెడలిపోవ నుద్యమించెను.

ఇంతలో మైత్రేయుఁ డెవఁడో దొంగ కన్నముఁ ద్రవ్వి యింటిలోఁ బ్రవేశించెఁ గావున నీ సువర్ణభాండమును నీవే దాచియుంచు మనుచుఁ గలవరించెను. శర్విలకుఁ డది యాలించి పరిహాసమున కట్లాడుచుండెనేమో యని కోపగించి మైత్రేయుని జంప నుద్యోగించెను. ఇంతలోఁ జిరుగుదోవతి కొంగున ముడి వైచుకొనుటచే దీపపుకాంతిలో ధగధగలాడుచున్న సువర్ణభాండమును గాంచి "నిష్కారణముగ బ్రాహ్మణహత్య నొనర్పఁ బూని తిని ఛీ! తుల్యావస్థయుఁ దుల్యజాతియుఁ గల వీని బాధించు టెందుల" కని విరక్తుఁడై యింకొక యింటికిఁ బోయెద నని పోఁ బోవుచుండ మరల మైత్రేయుఁడు "మిత్రమా! నాకేమో భయము వేయుచున్నది. ఈసువర్ణభాండమును బుచ్చుకొనకున్న

గోబ్రాహ్మణులమీఁద నొట్టుసుమీ" యని పలవరించెను. శర్వి లకుఁడును గోబ్రాహ్మణుల మీఁది యొట్టు దాటరాని దని దీపమార్పివైచి చేతుల చల్లగానున్న వేమని మైత్రేయుఁడు ప్రశ్నింపఁ జేతులు చంకలలోఁ బెట్టుకొని వెచ్చజేసికొని సువ ర్ణభాండమును బుచ్చుకొనియెను. బ్రాహ్మణకుల మంతయునుఁ జీఁకటి పాలుగావించితి ననియుఁ జతుర్వేద పారంగతుఁడు నప్రతి గ్రహీతయు నగువాని కడుపునఁ బుట్టియు బోగముతొత్తగు మదనిక కొఱకుఁ గదా యిట్టి దుష్కార్య మొనర్చితిననియు,

గీ. నరుల కెల్ల మానాభిమానములఁ జంపు
లేమి కన్నను దైన్యంబు లేదు జగతిఁ
గూడ దంచును నిందించుకొనుచు మరలఁ
జేయుచుంటిని గటకటా చెట్ట సేఁత.

అనియుఁ జింతింపుచు శర్విలకుఁడు వచ్చినదారినే సువర్ణభాండ మును బుచ్చుకొని మదనికాసందర్శన వాంఛ త్వరబెట్ట వేగ ముగ వెడలిపోయెను.

శర్విలకుఁడు వెడలిపోయిన కొంతకాలమునకు రదనిక లేచి తలుపులన్నియుఁ దెఱచియుండుటఁజూచి దొంగయెవ్వఁడో కన్నముద్రవ్వి యింటిలోఁ బ్రవేశించె నని గగ్గోలొనర్చుచు నిద్రించువారిని లేపెను. సువర్ణభాండమును శర్విలకుఁ డెత్తుకొని పోయిన సంగతి నెఱుఁగక పాపము చారుదత్తుఁడు

ఉ. కన్నము ద్రవ్వఁ దన్కరుఁ డొకండెవఁడో పొరుగూరి యాతఁ డిం, దున్న జనంబు స్వేచ్ఛగఁ బరున్న తెఱంగునెఱుంగఁ డాయె సం, పన్నుల మన్న యాశమెయివచ్చి శ్రమంపడి యిల్లుఁ జొచ్చియున్, జిన్నతనంబుచేసి దయచేసెను చేసిన చేత కేడ్చుచున్.

అని విచారింపఁ దొడఁగెను. మైత్రేయొన కింతలోఁ గొంచెము బుద్ధిమాంద్యము వదలి "మిత్రమా! చారుదత్తా! రాత్రి నీ చేతికొసఁగిన సువర్ణభాండము భద్రముగ నున్నదా యని ప్రశ్నించెను సువర్ణభాండమును మైత్రేయుని తెలివితక్కువచే దొంగ లెత్తుకొని పోయిన సంగతి నంద తెలిసెంగిరి. వసంతసేన కేమి సమాధాన మిత్తునా యని కుందుచున్న చారుదత్తునితో మైత్రేయుఁడు దొంగలెత్తుకొని పోయిన దానికి మనమేమి చేయుదు మనియెను కానిచారుదత్తుఁ డభిమానవంతుఁడు శుద్ధదరిద్రుఁ డౌటచే భోగముదాని నగ నపహరించి యాపన్నుగడఁ బన్నెనని వదరుఁబోతులు తూలనాడుదు రనియుఁ

గీ. ఘాతుకుండగు విధి నన్నుఁ గలిమియెల్లఁ
బాపి కావించెఁ గాక జీవచ్ఛవంబు
నేఁడు శుద్ధచరిత్రంబు గూడఁ బాపె
బ్రతికియుండుట కిం కేది పట్టు నాకు.

అనియు బిచ్చమెత్తి సంపాదించి యైన వసంతసేన నగ వసంత సేన కీయవలయుననియుఁ జింతింపసాఁగెను.

ఈ సమాచారమంతయుఁ జారుదత్తుని యిల్లాలగు ధూతాంబ రదనికమూలముగా నెఱింగెను. ఈమెయుఁ జారు దత్తునకుఁ దగిన భార్యయే సౌశీల్యమునం దాతని కించుకయుఁ దీసి పోదు. అంత నామె మైత్రేయుని బిలిపించి నాఁడు రత్న షష్ఠి యను నోము నోచుకొంటిననియు విభవము కొలఁది బ్రాహ్మణునకు దక్షిణయీయవలయుననియుఁ జెప్పి తన మెడ లోని రత్నహారము నొసంగెను. విదూషకుఁ డామె యభిప్రాయ మును గ్రహించి రత్నహారమును దీసికొనిపోయి చారదత్తున కొసంగెను. చారుదత్తుఁడు కష్టకాలమున బ్రాహ్మణి తన్నను గ్రహించి నందులకు సంతసించియు,

గీ. నిండు దురదృష్టమున దరిద్రుండనైన
నాకు దిక్కయ్యె నే స్త్రీధనంబు తుదకుఁ
బురుషుఁడే ద్రవ్యవతియైన పూవుఁబోఁడి
డబ్బు లేకున్నఁ బురుషుఁ డాఁడదియు సముచుం.

అని విచారించి యెట్టకేలకు మైత్రేయుని బిలచి సువర్ణభాండ మును నాదేనను మ్మకముతో జూదమునందోడి పోయితిని. కావున దానికిఁ బ్రతిగా నీ రత్నహారము నొసంగితివని వసంత

సేనతోఁ జెప్పి యీయాయవలయుననని పలికి రత్నహారము నొసంగి పంపెను.

అనంతరము దొంగ త్రవ్విన కన్నమునుజూచి నల్గురును నాలుగు విధములఁ జెప్పి కొనకుండఁ గప్పించివైచి చారుదత్తుఁడు కాల్యకరణీయంబుల నిర్వర్తించి సంధ్య నుపాసింపఁ బోయెను.

# మృచ్ఛకటికము.

## చతుర్థప్రకరణము

ఆమఱునాఁడు వసంతసేన చారుదత్తుని యందలిప్రేమ నానాఁటికి హెచ్చగుచుండుటచేఁ గాలయాపనముకొఱ కాతని చిత్రమును జిత్రించుకొని మదనికతోఁగూడ నాచిత్రపటమును విలోకించుచు నయ్యది నిజముగ నార్యచారుదత్తుని బోలి యున్నదియు లేనిదియుఁ దర్కించుచుఁ గూరుచుండెను. శకారునకు వసంతసేన మీఁదిమోహము తగ్గ లేదు. తల్లిని వలలో వైచుకొనినయెడల నామె మెల్లఁగఁ గూతుమనముఁ ద్రిప్పగల్గునని పదివేలరూప్యములు విలువ గలనగ నొకదాని నుపాయనముగ గవిసెన గప్పి యున్న బండియందుఁ బంపెను. వసంతసేన తల్లియు నది చూచి భ్రమసి చేటి నొకదానిని బిలచి యింతసొమ్మొసఁగు బోజుంగు మన కీజన్మములో లభ్యము గాఁడు. కావున దడయక బండియుం దెక్కి సంస్థానకుని దర్శింపఁ బొమ్మని కూఁతునకుఁ గబు రంపెను. చేటి వచ్చి తల్లియాజ్ఞ వసంతసేన కెఱింగించెను. వసంతసేన సాటిరోఁబోటులవంటిది కాదు కావు

నను, జారుదత్తునియందే మనస్సు లగ్నము చేసి యున్నది కావునను మండిపడి తాను బ్రతికియుండుట కిష్టమే నట్టి సందేశము లెన్నడును బంపవల దని చేటిద్వారా మరలఁ దల్లికి వర్తమాన మంపించెను.

తరువాతఁ జిత్రఫలకమును దనపడుకటింటిలో శయ్యపై నునిచి రమ్మని వసంతసేన మదనిక కాజ్ఞాపించెను. మదనికయుఁ జిత్తమని వెడలిపోయి యాపని నిర్వర్తించి యింతలోఁ దన మనోహరుం డగుశర్విలకుఁడు తనకొఱకు నగను దొంగిలించి వచ్చి వాకిటియందుఁ బొంచియుండుటఁ గాంచి వానితోఁ గలిసి మాటలాడఁ బోయెను. వసంతసేన యామె యెంతకాలమునకు రాకుండుటకును దానొంటరిగా నుండుటకును విసివి యేమి చేయుచున్నదో స్వయముగఁ జూచివత్తమని బయలుదేఱెను. మదనికా శర్విలకు లిర్వురు నీక్రిందివిధమున రహస్యసంభాషణమ్మున మునిఁగి యుండిరి. అది చూచి తా నెదురుపడి వారిమంతనముల కంతరాయము కల్గించుట మంచిది కా దని వారికిఁ గనుపించని ప్రదేశమున నుండి వసంతసేన యాలింపఁ దొడఁగెను.

శర్వి—ప్రాణేశ్వరీ! కావలసినద్రవ్య మొసంగియెడల వసంత
సేన నిన్ను దాస్యమునుండి విముక్తి సేయునా?

మద—ధన మెచ్చటనైన లభించినదా?

శర్వి—ఇదిగో! చూడుము. నీకొఱకే యీసువర్ణభాండమును
బలుకష్టములు పడి సంపాదించితిని.

మద—అయ్యో! ఎంతపని చేసితివి. ఇది యెచ్చట దొరకినది?

శర్వి—ఇది నిన్నరాత్రి చారుదత్తునియింటికిఁ గన్నము త్రవ్వి సంపాదించితిని.

మద—ఆయింట నెవ్వరికి నేహానియు నొనరింపలేదు కద?

శర్వి—ఈశర్విలకుఁడు బ్రాహ్మణవంశమున జన్మించినవాఁడు సుమా! నీ మీఁది మోహమున నిట్టి దొంగతనము నకైన నొడంబడియెను.

మద—నే నెఱుంగుదును. నీహృదయ మట్టిదే కాని నిజముగ నాయింట నున్నవారి కేవిధ మగుహానియుఁ గలుగ కుండ నీ వీనగను సంపాదింపఁ గలిగితివా?

శర్వి—అంతగ బ్రుచ్చియడుగుచుంటి వేమి? ఇదిగో! యజ్ఞోపవీతముతోడు నావలన నెట్టియాపదయు వారికిఁ గలుగ లేదు.

మద—అట్లయినఁ జాల సంతసము. తుదకుఁ బ్రియమే సంభవించినది.

శర్వి—ఎందుచేత?

మద—చారుదత్తభట్టారకున కేయాపదయుఁ గల్గకుండుటచేత?

శర్వి—ఈమె చారుదత్తుని వలచినది కాఁబోలును వృథా మోసపోయితిని.

సీ. వలపు నిలుపఁగరాదు కోమలులయందుఁ
బరిభవింతురు వలచినవారి స్త్రీలు

తరుణిమే తన్ను వలచిన దానివలపు
నడఁపవలయును లేదేని గడఁపవలయు.

కం. సొమ్మిచ్చిన నవ్వింతురు
నమ్మింతురు గాని ప్రియుల నమ్మరు కులశీ
లమ్ములు గలవారికి రో
సొమ్ములు కట్టా స్మశానకుసుమము లీలా ?

మదనికా ! నేఁటితో నీకును నాకును సరి నీ వెవ్వరిని వలచితివో వారినే యాశ్రయింపుము. ఇన్నివాళ్లనుండియు నీయందే వలపుంచినందులకు నాకుఁ దగినప్రాయశ్చిత్త మొసరించితివి.

మద—శర్విలకా ! ఎందులకు వృథాసంబద్ధప్రలాపిపై కోపగించెదవు. ఇందులోని రహస్య మంతయు నీ కెఱింగించెద ఈసగ వసంతసేనది.

శర్వి—చారుదత్తునియొద్ద నెందుల కున్నది ? ఈమెకు నాతనికి నేమి సంబంధము.

మద—నీ వెఱుఁగనే యెఱుఁగవా ? చారుదత్తుఁడు వసంతసేనకుఁ బ్రాణప్రియుఁడు. ఆనడుమ నొకనాఁడు వీధియందుఁ దుంటరులచేఁ దఱుమఁబడి యాతనియింటిలోఁ దల దాఁచుకొని యర్ధరాత్రిసమయము మగుటచే నాభరణము నాతనికి దాఁచ నిచ్చినది. చారుదత్తుఁడు వసంత

సేనను బ్రియుఁ డగుటచే నాతని కేహానియుఁ గలగకుం డుట ప్రియమే యనుకొంటిని. ఇంతమాత్రమునకే కోపమా ?

శర్వి—అట్లనా ?

గీ. ఎండవేఁడి సహింపలే కేనగంబు
నాశ్రయించితినో మున్ను విశ్రమింప
దానికొమ్మలనే పత్రహీనములుగఁ
జేసికొంటిని గటకటా ! చెట్టు నగుచు.

మద—ప్రియుఁడా ! జరిగినదానికి విచారించి మాత్ర మేమి ఫలము ? ఈదుష్కృత్యము వసంతసేన కనిపెట్టకుండ నేదేనుపాయ మాలోచించుకొనుము.

శర్వి—నా కేమియుఁ దోచుట లేదు. విపత్సమయములు సహజముగఁ బురుషులకంటె స్త్రీలే కుశాగ్రబుద్ధులు నీవే యిప్పుడు నన్ను గట్టెక్కింపవలయును.

మద—తగినయూహయే తోఁడగట్టినది. నీవు చారుదత్తుని సంబంధివిగా నటించి యాతఁడు పంపినాఁ డనిచెప్పి యీనగ నామె కిచ్చి వేయుము.

శర్వి—సరియే ! నీవు ముందు నడువుము నేను నిన్ననుసరించి యే వచ్చెదను.

వసంతసేన వీరిరాకఁ గనిపెట్టి యభ్యంతర మందిరము లోనికిఁ బోవును. మదనిక శర్విలకుని వసంతసేన యెదుటఁ

బెట్టినతరువాత నాతఁడు "నాయిల్లు ప్రాఁతదగుటచే రక్షించుట కష్టముగా నున్నది. కావున నీసువర్ణభాండమును నీవే కాపాడు కొనుము మఱి చారుదత్తుఁడు నీ కీయాభరణము నిచ్చిరమ్మనియె నని చెప్పి సువర్ణభాండము నొసంగెను వసంతసేనయుఁ దక్షణమే యీనగ నీ కెవ్వరు తెచ్చి యిచ్చెనో వానికి నీచెలికత్తె యగు మదనిక నొసంగి పెండ్లిచేయు మని నా కార్యపుత్రుని యాదేశ మని పలికి మదనిక నాతనివశము గావించెను. బండి సిద్ధము చేయించి వలయుకాన్క లొసంగి యాదంపతుల నిర్వుర వీడు కొల్పెను.

మదనిక యాదార్యపతియుఁ గృహాఖనియు నగు నేలిక సానిని విడువలేనివిచార మొకవంకయుఁ జిరకాంక్షితభర్తృసమా గమనంతోష మొకవంకయు సందడింప శర్విలకునితోఁ బోవు టకు సిద్ధపడియెను. శర్విలకుఁడును వసంతసేనయొక్క యుదార వర్తనమును జారుదత్తుని నామమాహాత్మ్యమును నోరార నుతించెను.

గీ. మంచిగుణములు కల్గినమనుజునకు న
సాధ్య మగుకార్య మెుందునే జగతియందు
నట్టి ముక్కంటితలకుఁ బూ వగుట యెందుఁ
గారణము చందురుని గుణగణము గాదె?.

బండి రాజమార్గమునఁ బోవుచుండెను. పాలకమహారాజు సిద్ధుఁడు చెప్పినమాటలను విని యార్యకుఁ డనుగొల్లపిల్లవాఁడు

ముందు రాజగు ననుభయముతో నాతని జెరయం దుంచి నాఁడు కావునఁ బ్రజ లందఱు నప్రమత్తులై యుండవలయు ననియు నాతఁడు పాఱిపోవుటకుఁ దోడ్పడఁ దలఁచినవా రెవ్వరే నున్నయెడలఁ గఠినముగ దండింపఁబడుదు రనియు రాష్ట్రియుని సాటింపు వినవచ్చెను. శర్విలకున కార్యకుఁడు ప్రియస్నేహితుఁడు ప్రాణమునకుఁ బ్రాణము అట్టి యాప్తమిత్రు నకు సంభవించిన యాపదకు మొదట వగచి తరువాత ధైర్య ముతోఁ దొల్లి యుదయనుని యౌగంధరాయణుఁడు విడిపిం చినట్లు తా నార్యకుని దప్పక విడిపింతు నని దృఢప్రతిజ్ఞ సలిపి మదనిక నెట్టకేల కొప్పించి యామెను జాగ్రత్తగఁ దనమిత్రుఁ డగు రేభిలునియింట దిగఁబెట్టుమని బండివానితోఁ జెప్పి శర్విల కుఁడు తనప్రతిజ్ఞానిర్వహణంబునకై బయలుదేఱెను.

చారుదత్తునియొద్ద సెలవు గైకొని రత్నహారమును వసంతసేన కిచ్చుటకు మైత్రేయుఁ డామెయింటి కీసమయమునకే చేరుకొనియెను. చేటియొక్కతె దారిఁ జూపించుచుండ గోపీ చందనముతో నలంకరింపఁబడి యాకసము నంటుచున్న సింహ ద్వారముసొబగున కచ్చెరువు గాంచి పలువిధంబు లగు ముగ్గు లతో నిండియున్న మొదటియంకణమును, గుఱ్ఱపుసాలలు, గుఱ్ఱములు నెద్దు తత్సంరక్షకులతో నిండి యున్న రెండవమొగ సాలయుఁ గులపుత్రకులు కూర్చుండుటకుఁ దగిన వేత్రాసనం బులు పఱచియున్న మూఁడవమొగసాలయు వివిధగానాభినయ

నృత్యంబులు నేర్చికొనుచున్న గణికాబాలికలతోడను వారి యుపాధ్యాయులతోడను నిండియున్న నాల్గవచత్వరంబును గడచి వివిధము లగునంటకంబులను దయారుచేయుచుండుటచేఁ బైకి వచ్చుకమ్మనితాలింపువాసనలు గలపంచమప్రకోష్ఠంబును దాఁటు నపుడు నోరూరుచుండ నానాజాతులరత్నములను బరీక్షించు చుండినమణిపరీక్షకులకును గుండనపుఁబని సేయుచున్నకంసాలు లకును దావలమై సంకుల మగునాఱవమొగసాలయు శుకశారి కాదు లగుపలురకముల విహంగములకుఁ దత్పోషకవర్గమునకు నివాసస్థానమై యుండినసప్తమాంగణంబును గడచి యెన్మిదవ మొగసాలయం దుట్టెఁ బెట్టిన గుమ్మడికాయవలెఁ బీఠముపైఁ గాళ్లు క్రిందకు వ్రేలాడుచుండఁ గూర్చొని యుండినవికృత స్వరూపిణి యగువసంతసేనతల్లిని జూచి నవ్వుచు నుద్యానవన మునం దొంటిగ నున్నవసంతసేనసమీపమును జేరెను.

వసంతసేన వచ్చినమైత్రేయుని గాంచి సంతుష్టాంతరంగయై నమస్కరించి యాసన మిచ్చి కుశలప్రశ్న మడిగి యనంతర మఱుదెంచినకార్య మే మని ప్రశ్నించెను. మైత్రేయుఁ డంతటఁ జారుదత్తుఁడు సువర్ణభాండము తనదే నను నమ్మకముతో జూద ములో నోడిపోయె ననియు గెల్చినవాఁడు రాజుగారిచారుఁ డెచ్చటి కేగెనో తెలియనందున దానికిఁ బ్రతిగ నీరత్నహార మును బుచ్చుకొను మనినాఁడనియుఁ జెప్పి తాను తోడ్కొని వచ్చినరత్నహార మెదుటఁ బెట్టెను. వసంతసేన జరిగిన దంతయు

నెఱిఁగియున్నదికావునఁ జారుదత్తుని శీలమున కబ్బురపడుచుఁ బువ్వులు రాలిపోయిన మామిడిచెట్టునకు మకరందబిందువు లెచ్చటి వని నవ్వుచుఁ బ్రశ్నించి నేను బ్రదోషసమయమున దర్శనమునకు వత్తు ననియీ జూదగానితోఁ దెల్పవలయునని మైత్రేయుని గోరెను. మైత్రేయుఁ డట్లే యని సమ్మతించి యామెకడ సెలవు గైకొని విచారముతో రత్నావళిమూల్యము సువర్ణభాండమునకు సరిపోవునది కాదుకాఁబోలును మరల నీభోగముది సాయంసమయమున వచ్చెదనని కబు రంపినది. తగవు బెట్టుచేమో ఆదరిద్ర చారుదత్తుఁ డెచ్చటినుండి తెచ్చియిచ్చును ఎంతటిశీలవంతులకును భోగమువారలతో స్నేహము ప్రమాదమునకుఁ గారణముకాక తప్ప దనుకొనుచు నింటిమొగము పట్టెను.

---

# మృచ్ఛకటికము.

## పంచమప్రకరణము

చారుదత్తుఁడు నాఁటిసాయంసమయమున గృహారామమునం దెండిపోయిన చెట్లగుంపుమధ్య నాలోచించుకొనుచు మేఘావృత గగనయాకసము యొక్క విలాసములఁ దిలకించుచుండెను.

సీ. కలసినచక్రవాకంబులగతి తెక్క
లల్లార్చి యెగురురాయంచ లట్లు
జలములోఁ దిరుగుచేపలకీతి జనపరి
భ్రాంతంబు లగుమకరముల పగిదిఁ
గమనీయశృంగజంగమసౌధముల భాతిఁ
బరుగిడు చున్నయశ్వముల చాయ
మిట్టిపై కెత్తినలొట్టిపిట్టల మాద్రిఁ
గ్రమముగాఁ జొప్పుపుల్గుల విధమున

గీ. వాయువిక్షేపితంబులు వారివాహ
ఖండములు పెక్కురంగులు గలవి నడువఁ

జనలు భాసిల్లుచున్నది చారుచిత్ర
రచనఁ గన్పిం దొసంగువస్త్రంబు పగిది.

గీ. ఆంబికేయుః యూననం బయ్యె మిన్న
పొంగుచుండెను రారాజు పోల్కి నెమలి
యోడ్వ్యధర్మజుఁ డోడినజాడఁ బికము
డాఁగె రాయంచగములు పాండవుల పగిది.

మైత్రేయుఁడు వసంతసేనయొద్దనుండి సరిగ నీసమయమునకే తిరిగివచ్చి రత్నావళిఁ బుచ్చుకొని చెలికత్తెలకుఁ గంటిసైగఁజేసి మొగము పైటచాటునఁ బెట్టుకొని తన్నపహసించినదనియు రత్నావళి చాల దని తగవుబెట్టుటకుఁ గాఁబోలు సాయంకాలము మీజూదగానిని సందర్శింతు నని తెలుపుమనిదనియుఁ జెప్పి పెక్కుసిలుఁగుల కాకరముగావున గణికావ్యామోహము నీకనైనఁ గట్టిపెట్టుట మంచి దని చారుదత్తునకుఁ బరిపరివిధముల బోధించెను. వేశ్యాసంగమము దుఃఖకారణమను విషయమును బెడచెవిని బెట్టి రత్నావళి చాల దని తగవుబెట్టుటకే వచ్చునెడల నామె సంతసించుచుఁ బోవఁగలదు లేయని మైత్రేయునకు సమాధాన మొసంగి మఱింతయుత్కంఠ హెచ్చ నేదియో యాలోచించుకొనుచుఁ జారుదత్తుఁడు కాలక్షేప మొనర్చుచుండెను.

అంతట మేఘములు క్రమముగా వర్షింవసాగెను. వసంతసేనచేఁ బంపఁబడినకుంభీలకుఁ డనుచేటుఁడు ముందు వచ్చి

యుద్యానవనముతల్పు మూయఁబడి యుండుటచే దూరముగా నున్నమైత్రేయు నొక మంటిబెడ్డతోఁ గొట్టి తల్పు దీయించుకొని చారుదత్తునితో వసంతసేన వచ్చుచున్న దని తెల్పి పైఁగప్పుకొనిన యుత్తరీయమును బహుమతిగాఁ బడసి పోయెను. వర్షము క్రమక్రమముగా హెచ్చసాగెను. అంతకుముందటునిటు సంచరించుచుడిన మేఘము లొక్కచోటనే నిలువఁబడినవి. స్వర్ణగకుథములు గట్టినవారణము లట్లు విద్యుత్తుతోఁ గూడి తిరుగాడు చుండినయంబుదములను వెండిగొలుసులతో నింద్రుఁడు లాగించుచుండెనో యనునట్లు వారిధారలు వర్షించుచుండెను. కృతఘ్నునియం దుపకారము పోలికగాఁ దారక లంతరించెను. వివిధప్రమదాజనము లట్లు దిగ్వారము కాంతి వాసెను. సురేశ్వరాయుధాగ్నిచేఁ దప్తమైయంబరము ద్రవాకారముఁ జెంది నిటిరూపునఁ గ్రిందఁ బడుచున్నదో యనునట్లుండెను. జనసంచారము పూర్తిగఁ దగ్గిపోయినది ఇట్టి సమయమున నుజ్జ్వలాభిసారికా వేషముతోఁ ఛత్రమును దాల్చి వసంతసేన విటుఁడనునాప్తుయునితో ముచ్చటించుకొనుచు, జారుదత్తుని గృహాంగణమునకు బయలుదేరెను.

గీ. ఉఱుముఁగాక పయోదముల్ కుఱియుఁగాక
పిడుగు వడుఁగాక యగుఁగాక పుడమి కడలి
చలియు వేడియుఁ జూడరు లలన లకట!
రమణుసాన్నిధ్యమున కేగుసమయ మందు.

వసంతసేన చారుదత్తునిగృహారామమును జేరి కూడ వచ్చినవిటుని ఛత్రధారికచే గొడుగుపట్టించుకొని యింటికిఁ బొమ్మని పంపివైచి మైత్రేయుని మీజూదగాఁ డెచ్చట నున్నాఁ డని ప్రశ్నించి యాతఁడు త్రోవఁ జూపుచుండఁ జారుదత్తుని సమీపించెను.

వసం—జూదగానికిఁ బ్రదోషసమయము సుఖకరమేనా ?

చారు—సంధ్య జాగ్రదవస్థయందును దమి యూర్పులు పుచ్చుటతోడను తరలుచున్నవి ఇఁక నీరాకచే మాత్రము సంధ్య సుఖప్రదము కాఁగలదు నీకుఁ గుశలమా ?

వసం—తమదయవలన.

మైత్రే—ఈయంధకారసమయమున నేల వచ్చితివి. ఇప్పుడు రాకపోయిన నేమి ?

చేటి—అయ్యా ! మైత్రేయ ! మీరుతీసుకొనివచ్చి యిచ్చిన రత్నహారమును మాయేలికసాని తనదే యనునమ్మకముతో జూదమునం దోడిపోయినది. గెలిచినవాఁడు రాజచారుఁడు వాఁడెచటకుఁ బోయెనో తెలియవచ్చుట లేదు ఆతనియునికి తెలియవచ్చునంతవరకు నీసువర్ణభాండమును మీయొద్ద నుంచుఁడు.

చారు—మిత్రమా ! ఇది యేమి ? ఇది చోరుఁడు దొంగిలించిన సువర్ణభాండమే కాదా ?

చేటి—అయ్యా! శర్విలకుఁ డనుదొంగ మామదనికను ప్రేమించి యామెను దాస్యమునుండి విడిపించుటకుఁ జాలినంత ధనము లేమిచేఁ బాపకృత్యమున కొడిగట్టినాఁడు.

వసం—ఆర్య! చారుదత్త! ఈరత్నావళి ధరించుటకుఁ దగిన యోగ్యత నాయొద్ద లేదు. పరమపవిత్ర మగు మీకుటుంబము ధరించుదానిని నే ముట్టుకొనుటకైన సమర్థురాలనుగాను. కావున దీనిని మీరు మరలఁ గైకొనుఁడు.

చారు—సఖీ! వసంతసేన! నేను పంపుటకుఁ దగినకారణము లేక పోలేదు. దరిద్రుఁడగు చారుదత్తహాతకుఁడు బోగముదానినగ నపహరించె నని లోకు లడిపోయుదురు. ఆయపవాదమునకు భయపడి స్త్రీధనం బనియైన నెంచక నీకుఁ బంపితిని ఒకమారిచ్చిన దానిని మరలఁ బరిగ్రహించు నంతటి నీచుఁడు మాత్రము నీప్రియుఁడు కాఁడుసుమా!

వసం—ఇంత సుగుణవంతుఁడ వౌటయే నిన్నుఁ గామించుటకుఁ గారణము. పిదప వార లిరువురు నన్యోన్యానురాగ పరిణామమును గూర్చి యిఁక కొంతతడవు ముచ్చటించుకొని మైత్రేయుని జేటిని వీడుకొల్పి యభ్యంతరగృహమ్మునకుఁ బోయిరి.

---

# మృచ్ఛకటికము.

## షష్ఠప్రకరణము

తెల్లవాఱెసది. నిద్దానుండి  చి చారుదతుఁడు బండి పూన్చి పుష్పకరండకజీర్ణోద్యానములోనికి వసంతసేననుదోడి తెమ్మని వర్ధమానకునకుఁ జెప్పి తా నచ్చటికిఁ  ోయెను. వసంతసే  నిద్దుర లేచి కాలకృత్యములు నిర్వర్తించుకొని చారుదత్తుఁడు పుచ్చుకొనకపోవుటచే రత్నావళిని ధూతాంబకే యీయఁ దలంచి యామెయొద్దకుఁ బోయెను. ధూతాంబయు నార్యపుత్త్రుఁడు నీ కనుగ్రహముగా నిచ్చినదానిని మరల నేను గ్రహింప నోపనని నిరాకరించెను. భర్తకుఁ దగిన భార్యయు భార్యకుఁ దగినభర్తయు దొరకుట దుర్ఘటమని వారిదాంపత్యమున కచ్చెరువు నొందుచు వసంతసేన మరలివచ్చుచుండెను.

పొరుగింటి సంపన్నుల బాలకుఁడొకఁడు సువర్ణశకటితో నాడుకొనుచుండెను. అది చూచి చారుదత్తుని కుమారుఁడు నాకుఁ గూడ నట్టిబండి కావలయు నని పట్టుబట్టెను. రదనిక మట్టిబండి నొకదానిని చేసియిచ్చెను. కాని యాతఁ డేడుపు

మూనలేదు. పూర్వ మొకప్పు డైశ్వర్య మనుభవించిన వాని పుత్రుఁ డీగతి నేడ్చుచుండుటకు రదనిక మిగుల విచారించి విపరీతకాలమును దెచ్చిపెట్టినభగవంతుని చెయిది నిందించుచు నాయనా! మీతండ్రిగారికి మరల నైశ్వర్యము వచ్చినప్పు డిట్టి దానితో నాడుకొనవచ్చునులె మ్మని యోదార్చుచుండెను. ఆమె వసంతసేనను జూచి బాలకు నామెయొద్దకుఁ దీసికొని వచ్చెను. మూఁడుమూర్తులఁ జారుదత్తు ననుకరించు చున్న యాబాలకుని దగ్గఱకుఁ దీసికొని యాతఁ డింకను సువర్ణశకట ముకొఱ కేడ్చుచుండుటఁ గాంచి వాని నోదార్చుటకై తన మేని సొమ్ముల నొలిచి వీనితో బంగారుబండి చేయించుకొను మని పల్కి యానగలు మట్టిబండిలోఁ బడవైచెను. రదనిక బాలకుని వెంటఁ బెట్టుకొని యానగలతోఁ గూడ వెడలి పోయెను.

వర్ధమానకుఁడు బండిని పూన్చి తీసుకొని వచ్చెను కాని వసంతసేన యింకను దననేపథ్యము బూర్తి గావించుకొనలేదు. ఇప్పుడే వచ్చెదనని యలంకరణము బూర్తిగావించుటకై యామె లోనికిఁ బోయినది. వర్ధమానకుఁడు బండిలోని యాస్తరణము మఱచి వచ్చెను ఈలోపుగ నది తెచ్చుకొన వచ్చుఁ గదా యని యెంచి ముక్కాలకుఁ ద్రాళ్లు వేసిన పొగరుగిత్త లచ్చట నొంటిగ నిలువవుగాపున బండికూడఁ దోలుకొని పోయెను.

రాజస్యాలకుఁ డగుశకారుఁడు పుష్పకరండకజీర్ణోద్యాన మునకుఁ దనబండిని దోలుకొనిరమ్మని స్థావరకుని నియోగించెను. అతండును బండి పూన్చి చారుదత్తునియింటివైపు తీసుకొని వచ్చుచుండ సరిగ నాతని యింటిగుమ్మము వద్దకు వచ్చునరికి దారిలో నింకొకబండి చక్రములు జారిపోవుటచే నాబండివాఁడు చక్రములను మరలఁ దగుల్చుటకుఁ బాటుపడుచుండెను. స్థావరకుఁడు తనశకటము నాపి వానికి సాయముఁ జేయఁ బోయెను. వసంతసేన యలంకరణము పూర్తిగావించుకొని వీధిలోనికి వచ్చి యాఁగి యున్నబండి వర్ధమానకుఁడు తనకొఱకుఁ దీసికొని వచ్చినదే యనుకొని యందెక్కెను. స్థావరకుఁడు తా నేగినపని పూర్తియైన వెంటనే వచ్చి బండియం దెవ్వరున్నదియును జూచుకొనకుండఁగనే శకటమును దోలుకొని పోయెను.

మిత్రుఁ డగుశర్విలకుఁడు ప్రతిజ్ఞానిర్వహణ మొనర్చి చేసినసాహాయ్యమువలన గోపాలదారకుఁ డగునార్యకుఁడు చెరసాలనుండి తప్పించుకొని యొకకాలియందు సంకెల గలగలలాడుచుండఁ దొందరగా నలువైపులనుండియుఁ దన్నుఁ బట్టుకొన వచ్చుచున్న రాజభటులబారినుండి తప్పించుకొనుటకై పఱువెత్తుకొనివచ్చుచుఁ జారుదత్తభట్టారకునింటితలుపు తెఱచియుండుటచే నందుఁ బ్రవేశించి డాఁగియుండెను. ఇంతలో వర్ధమానకుఁడు బండిలోనియాస్తరణముఁ జక్కబఱుచుకొని

బండి తీసికొనివచ్చి వసంతసేనకొఱకుఁ గేకవైచెను. ఆర్యకుఁడు మిగుల సంతసించి బండివెనుకనుండి వచ్చి యం దెక్కెను. సంకెలలగలగల విని వర్ధమానకుఁడు నూపురధ్వని యనుకొని వసంతసేనయే శకట మధిరోహించె నని నమ్మి తోలుకొని పోవసాగెను.

చందనకవీరకు లనునిద్దఱు రాజభటులు రాజమార్గమునవచ్చుచుఁ బోవుచున్నశకటములఁ బరీక్షించుటకై నియోగింపఁబడిరి. వా రతిజాగ్రత్తగాఁ బరీక్షించుచు రాజమార్గమున వచ్చుచున్న చారుదత్తునిబండి నీక్షించిరి.

చం—ఈబండి యెవ్వరిది ?

వర్ధ—అయ్యా! ఇది చారుదత్తభట్టారకునిది. ఇం దధివసించి వసంతసేన పుష్పకరండకజీర్ణోద్యానమున కాతని గలసి కొనఁ బోవుచున్నది.

చంద—బండి నాపుము. వీరకా! నీ వేగి యం దెవ్వరున్నారో పరీక్షింపుము.

వీర—నీవే చూడుము. నీవును రాజుగారిసేవకులలో నమ్మకమైనవాఁడవే.

తుదకుఁ జందనకుఁడే బండిని బరీక్షించుటకు నిశ్చయమయ్యెను. కాని దించినతరువాతఁ జందనకుఁడు చూచుసరి కం దార్యకుఁ డను గొల్లపిల్లవాఁడు కాన్పించెను. ఆర్యకుఁడు సమయము మించివచ్చినందులకు విచారించి తుదకు ధైర్యము

వహించి మస్తకన్యస్తాంజలిపుటుండై చందనకునితో నిట్లనియెను.

ఆర్య—అయ్యా! శరణాగతుఁడను నాకుఁ బ్రాణభిక్ష పెట్టుఁడు.

గీ. పరుల కుపకార మొనరింపఁ బాటుపడెడు
వాఁడు శరణాగతత్రాత కీడు జెందు
నేని జెందునుగాక తాదృశుని లోకు
లెన్నఁ డురుగాని నిందింప రిందు నెందు.

చం—సరియే నీకు వచ్చినభయ మేమియును లేదు లెమ్మా.

వీర—చందనకా! అంతసేపు పరీక్షించుచుంటి వేమి?

చం—ఏమియును లేదు. ఆర్యుని జూచితిని కాదు కా దార్య చారుదత్తు నభిసరింపఁబోవుచున్న వసంతసేనను జూచితిని.

వీర—తడఁబడుచుంటి వేమి?

చంద—మాట తొట్రుపాటు ఇం కేమియును లేదు.

వీర—నేనుగూడఁ జూడవచ్చునా?

చంద—నేను పరీక్షించినతరువాత నీవుగూడ నెందులకు?

వీర—కాదుకాదు నా క నుమానముగా నున్నది.

చంద—ఏమి? నామాటలయందు నీకు నమ్మకమే లేదా?

వీర—నమ్మకము లేకపోవుట కాదు. రాజుగారికి నీ వెంత విశ్వాసపాత్రుఁడ వగుసేవకుఁడవో నేను నంతవిశ్వాస పాత్రుఁడనే.

చంద—నేను పరీక్షించినబండి మరలఁ జూచుటకు నీ వెవ్వాఁడవురా!

వీర—నీ వెన్ని చెప్పినను నేను విడుచువాఁడను గాను.
మొదటఁ దడఁబడుటయు దరువాత నన్ను వలదనుటయు
నాకు సందేహమును వృద్ధి సేయు చున్నవి.

అనుచు బండిదగ్గఱకు వచ్చినవీరకుని జుట్టు బట్టుకొని తన్ని యీజోలికి నీవు వచ్చితివే నిఁక నీప్రాణములు దక్కవు జాగ్రత్త యనినచందనకునిపై నాగ్రహించి వీరకుఁడు రాజసభకుఁ బోయి దీనికిఁ దగినప్రతిక్రియ సేయుదు నని వెడలిపోయెను. చందనకుఁడును వీరకునిపీడ వదలిపోయినందులకు సంతసించి శకటము నెవ్వారే నాపినచో మేము పరీక్షించితి మని చెప్పు మని వర్ధమానకున కుపదేశించి తనచేతియం దున్న ఖడ్గము నాత్మసంరక్షణార్థము గోపాలదారకున కిచ్చి వ్యాజముగా వసంతసేనా! సంపదలు కల్గిననాఁడు నీమిత్రుఁడ నగు నన్ను మఱచిపోవకుముసుమా యని హెచ్చరించుచు వెడలిపోయెను.

గీ. కత్తి చేతికి దొరకెను గంపమాన
మయ్యె దక్షిణభుజము భయమ్ము లేదు
సర్వ మనుకూల మగు నింకఁ జందనకుని
మితికిమీఱినదయచేత బ్రతికినాఁడ.

అనుకొనుచుఁ జందనకుని దయాతిరేకమునకుఁ గృతజ్ఞతాపూర్వకవందనంబు లాచరించి యార్యకుఁడు బండియందు క్షేమముగ నావలకుఁ దాఁటెను.

---

# మృచ్ఛకటికము.

## సప్తమప్రకరణము

పుష్పకరండకజీర్ణోద్యానమున వసంతసేనరాక కెదురు చూచుచుఁ జారుదత్తమైత్రేయు లిరువురు నుద్యానశోభకు సంతసించుచుఁ గూర్చుండి యుండిరి కాని యెంతసేపటికిని వసంతసేనజాడ కాన్పింపలేదు. చారుదత్తున కుద్వేగ మధికము కాఁజొచ్చెను. దారియందు బండిచక్రములే జారిపోయెనో బిగించిన తల్పులే తెగిపోయెనో రాజచారులు శకటము నడ్డిరో లేక శకారాదులు మధ్యమార్గమునఁ గానుపించి బాధపెట్టుచుండిరో వృషభములు మారుదారి వట్టెనో యని పరిపరివిధములఁ జింతింపసాగెను. ఇట్లు సందేహాతరంగితుఁడై కొంతకాలము వేగించు నప్పటికి శకటము దృగ్గోచర మాయెను బండిదగ్గఱకు వచ్చుకొలఁది జారుదత్తుఁడుత్కంఠ యధికమై ప్రియురాలిస్వయం గ్రహాలింగనముకొఱ కువ్విళ్ళూరఁ జొచ్చెను.

బండిలో నున్నగోపాలదారకుఁడుగూడ వివిధభావములకు లోనుగాఁ జొచ్చెను ఇచ్చట నీచెట్లతోఁపులో దాఁగియుంటినా

లేక బండి దిగి పాఱిపోవుదునా ? చారుదత్తునియొనుటఁ బడి నచో నామహానుభావుఁడు న న్నాదరించునో లేక రాజ భయంబున నేను శరణనివేఁడుకొను చున్నను నిరాకరించునో అతఁడు మిగులధర్మాత్ముఁడు శరణాగత త్రాణపరాయణుఁడు న న్నేల నిరాకరించును.

గీ. అతఁడు నాపదుదురవస్థ నరసె నేని
నిరుపమానపుఁ గరుణ గన్పింపఁ గలఁడు
చిరతరాపదలో మున్గి చివికియున్న
నాయొడలు నిల్పినవి తద్గుణములు గావె ?

అని సంకల్పవికల్పములకు లోనై తుదకుఁ జారుదత్తుని దర్శించు టకే నిశ్చయించుకొనెను.

చారుదత్తుఁడు బండియొద్దకు వచ్చి యందు వసంతసేన యుండుటకు మాఱార్యకుఁ డుండుటకు విస్మితుఁడై యతనిరూ పమునకు ముగ్ధుఁ డగుచు.

ఉ. ఏనుఁగుగున్నతుండముల కెక్కువ చేతులయంద మున్నతా
పీనతరాంసభాగముల పెక్కువ రక్తసరోజపత్రముల్
బోఁ విలోచనంబులు సమున్నతవక్షము గల్గి యున్న యీ
ప్రాణికి నేలొకో నిగళబంధ మొనర్చిరి కాలి కక్కటా !

అని విచారింపుచు నీ వెవ్వఁడ విట్లు వచ్చుటకుఁ గారణ మే మని ప్రశ్నించెను. మహారా జగు నని యొకసిద్ధుఁడు చెప్పుట

వలనఁ గోపించి దుర్మార్గుఁ డగుపాలకమహారాజు తనదోష మేమియు లేనిదే చెరసాలయందుంచిన యార్యకుఁ డనుగోపాలదారకుఁడనియు మిత్రుఁ డగుశర్విలకుని సహాయమునఁ గారాగారమునుండి తప్పించుకొని దైవవశమునఁ గాన్పించిన బండియం దెక్కి వచ్చితి నని చెప్పి రాజభటుల కంటఁ బడకుండఁ దన్ను రక్షించి పుణ్యము గట్టుకొమ్మని వేఁడుకొనియెను.

చారుదత్తుఁ డొక్కింత దీర్ఘముగ నాలోచించి పరమేశ్వరునకుఁ దక్క మానవులకు జంకుస్వభావము లేనివాఁడును గుణపక్షపాతియుఁ గావున నార్యకునియం దనురాగము వహించి కాలిసంకెల లూడఁదీయించి సురక్షితమగుచోటికిఁ బోవుటకుఁ దనశకటమును స్వేచ్ఛగ నుపయోగించుకొను మనియుఁ దన్ను మఱవవల దనియుఁ బల్కెను ఆర్యకుఁడును జారుదత్తుని యనుగ్రహమును గొండాడుచుఁ బునర్దర్శనము లభించుఁ గాత మని పల్కి సెలవు గైకొని వెడలిపోయెను.

జరుగుచున్న సంఘటనములకు విస్మయమును సంతోషమును విచారమునుగూడి ముప్పిరిగొన వసంతసేన కేయుపద్రవము సంభవించినదో యని మనమ్మునఁ దహతహ లాడుచు నామె సమాచారమును గనుగొనుటకై చారుదత్తుఁ డంతట మైత్రేయునితోఁ గూడ నింటికి వెడలిపోయెను.

# మృచ్ఛకటికము.

## అష్టమప్రకరణము

క్రొత్తగఁ బౌద్ధసన్యాసి యైన సంవాహకుఁడు పుష్పకరండక జీర్ణోద్యానమునఁ బ్రవేశించి యందున్న కొలంకున స్నానాదివిహితకృత్యంబుల నిర్వర్తించుకొని తన కాషాయవస్త్రముల నారవేసికొనుటకుఁ దగిన స్థలమును వెదకుచు నిటునటుఁ దిరుగాడుచుండెను. ఇంతలో వాని ప్రాణమునకు యమదూతవలె నందొక మూలనున్న శకారుఁడు వీనిని జూచి యచ్చటికి కఱుదెంచి క్రుద్ధుఁడై ఖడ్గముఁ జేతఁబూని కొలనిలోఁ దానే యెన్నఁడును స్నానమాచరించి యెఱుఁగననియుఁ బ్రాతయులవగుగ్గిళ్ళవంటి రంగుగల ముఱికిగుడ్డలనందుది కెదవా యనియు దండింపసాగెను.

ఉ. ఫాలముతొల్లి యున్నటులఁ బచ్చగనే తనరారుచుండె శూ
న్యాలకమయ్యెఁ జీవర కృతాంతముగన్పడ దంసకమ్ములన్
జాలదు కావిరంగు వసనంబులనున్నటచేత గామిచేఁ
జేలపుటంచు నిల్వదు విశీర్ణకమై సరిగా బుజంబులన్.

వీఁడు క్రొత్తఁగా సన్యసించుటచే యుద్యానవనము నీదియనియు, నిందిట్టి మర్యాదలు కలవనియు నెఱుంగఁడనియు నెఱుఁగని వానిని దండించుట పాపహేతువనియుఁ గావున క్షమింపుమనియు విటుఁడు వాదించుచున్నను, "బాబూ నేనెఱుంగను ఎన్నేల హింసింతువు. ఇఁక నెప్పుడు నిక్కడ నడుగుబెట్టను ఈ ప్రథమాపరాధమును మన్నింపుము: నన్ను క్షమించినచో బుద్ధభగవానుఁడు నీకు సకలైశ్వర్యముల నొసంగు రక్షించు" మని సంవాహకుఁడు వేఁడుకొనుచున్నను శకారుఁడు వానిని గాలఁదన్ని యనేకవిధముల బాధించి యింకొక చోటికి బొమ్మని తఱిమివైచెను.

చేటుఁడింకను బండి తోలుకొనిరాలేదు. సహజకోపస్వభావుఁడగు శకారుఁడు వానిని నోరారఁ దిట్టుకొనుచుండెను. పాపము వసంతసేన తనకొఱకిచ్చుట నొక మహావ్యాఘ్రము మెదురౌ నని యెఱుఁగదు కాని నయనము లదరసాగెను. హృదయము కంపించుచుండెను. తన కేమియాపద కనిపెట్టుకొని యున్నదో యని తహతహలాడుచుఁ బ్రియుడఁగు చారుదత్తుని యొద్ద కేగుచున్నప్పు డీదృశసందేశములకుఁ దావెచ్చటిదని తన్నుఁ దా నోదార్చుకొనుచు శకటమునఁ గూరుచుండెను. స్థావరకుఁడింకను విశేషముగఁ బ్రొద్దుపోలేదని చాల నెమ్మదిగ శకటమును దోలికొనుచు నెట్టకేలకుఁ బుష్పకరండక జీర్ణోద్యానమునకుఁ జేరుకొనియెను. శకారుఁడు పఱుగు పఱుగున వచ్చి

నాయనా చేటా! చచ్చిపోకుండ వచ్చితివా యని స్థావరకుని బరామర్శించి బండిలోఁ జూచునప్పటికి వసంతసేన కన్నులకగు పట్టెను. వసంతసేన జరిగిన పొరబాటు దెలిసికొని నిర్భ్రాంత పోయెను. శకారుఁడు మొట్టమొదట భూతమేమో నని భయము చెంది తరువాత మనసు కుదుటపరచుకొని వసంతసేన తనంత తానే తన్నుఁ గామించివచ్చిన దని సంతోషముచే నోరు చప్పరించి యీనాఁటికి నాపై దయగల్గి స్వయంగ్రహాలింగన మొనర్చుకొనివచ్చితివా ధన్యుఁడ నైతి నని సంతోషసూచకమ్ముగ బండిదిగి యెూరగానిల్చిన యామె కాళ్లఁబడి నమస్కరించెను. వసంతసేన మిగులఁ జీకాకుపడి యాతని శరీరస్పర్శమైన నేహావమబ్బునని తలంచి శిరస్సు నావలకుఁ ద్రోసివైచెను.

శకా—నాకఠినశిరస్సు తాఁకుటచే నీఁబువ్వుకోమల మగు నీపాదము నొచ్చియుండవచ్చును. ప్రేమించిన కాంత తన్నినను బహూకరించినట్లే ప్రియురాలా! ప్రేమించి వచ్చి దూరముగా నుండెద వేమి?

వసం—అయ్యా! దైవవశమున నంతయుఁ బొరపాటు జరిగినది. శకటముల వ్యత్యయముచే నిట్లు వచ్చితిని.

శకా—అయిననేమి నాభాగ్యము పండినది. రమ్ము. నన్ను పేక్షించకుము.

వసం—అయ్యా! పరానురక్తయగు కాంతవలన మీ కేమి సౌఖ్యము నన్ను నిర్బంధింపకఁ బోనిండు.

శకా—కాంతా ! చేఁజిక్కిన నిధానమును బుద్ధిపూర్వకముగాఁ బారవైచికొను వారెవ్వరైన నుందురా ? శకారుని నమ్ముకొనిన వారెవ్వరును జెడిపోవరు. నన్నువలచినచో నీ మహారాజ్యమంతయు నీ చేతనే యేలింతును.

వసం—ప్రేమకు హృదయము ప్రధానము గాని సంపదలు కొఁజాలవు.

శకా—అట్లయిన నాయనునయములను బెడచెవిని బెట్టెదవా ?

వసం—నామనస్సన్యాధీనమై నప్పుడు నే నంతకన్నఁ జేయవలసిన దేమియును లేదు.

శకా—నన్ను నిరాకరించుట నాతో విరోధమును దెచ్చుకొనుటయే సుమా !

వసం—అయినమాత్ర మేమి చేయఁగలను ?

శకా—ప్రాణములతో నిచ్చటినుండి కదలఁజాలవు.

వసం—అసహాయురాలగు నొక కాంతపై మీకంత యనుగ్రహము గల్గినను నేను మాత్రము నామనస్సు ద్రిప్పుకొనఁజాలను.

శకా—బావా ! మన మెన్ని చెప్పినను యీమె లొంగునట్లు లేదు. మౌర్ఖ్యమునకుఁ దగిన శిక్ష యనుభవించును. నాయాజ్ఞ గావున నీమెను దక్షణమే చంపుము.

విటు—రామ ! రామ ! శకారా! నీకేమి మతి పోయినదా?

ఉ. ఆఁడుది బాల యీనగరికంతయు మేలివిభూషణంబు రో
చేడియయయ్యొ దానికుల చేష్టలు లేనిది నాకుఁజంపఁజే
యాఁడునె? యాఁడెఁబోయిటునిరాగసురాలికి నెగ్గుసేయునా
కోడలభించనేర్చునె యమోపరలోకనదిన్ దరింపఁగన్.

శకా—బావా! ఎందుల కీపనికిమాలినభయము. నీవు వసంత
సేనను జంపితివని యొరుల కెట్లు తెలియును. ఒకవేళఁ
దెలిసినను రాజస్యాలకుఁడను నేనుండ నీకేమి భయము
సందేహింపకుము.

విటు—శకారా! ఎవ్వరును జూచుటలేదని సమర్ధింపకుము.

గీ. దెసలు ధర్మానిలులు వనదేవతలును
జంద్రసూర్యులు నంతరిక్షంబు నంత
రాత్మయును భూమిపాపపుణ్యములనెపుడుఁ
జూచుచుందు రిఁకెవ్వరు చూడకున్న.

శకా—బావా! నీ వీనిరర్థకసందేహములను మానివైచి నాకు
సహాయ మొనర్చినచో నిన్ను గొండయెక్కింతును.

విటు—నీ వెంతకైనను సమర్థుఁడవే కాని నీవు చెప్పినచొప్పునఁ
జేయుటకు నా మన స్సొప్పుకొనుటలేదు.

శకా—నాయనా! చేటా! ఈ ముసలిపంది యెప్పుడును
నధర్మమని జడియుచునేయుండును. నీవైన స్వామి
కార్యము నొనరించి విశ్వాసమును జూపెట్టుకొనుము.

స్థావ—నాకును భయమగుచున్నది.

శకా—ఎందువలన?

స్థావ—పరలోకమువలన.

శకా—నీకు బహుళమగు ధనమొసంగెదను. సేవకావృత్తినుండి తప్పించెదను. జన్మాంతము నందాఁక నొరుల సేవతో నిమిత్తములేకుండ సుఖముగఁ గాలక్షేపము సేయ వచ్చును.

స్థావ—ప్రభూ! నిరపరాధినియగు కాంతను జంపుటకు నామన స్సొప్పుకొనుటలేదు. సేవకుఁడను ప్రభువాక్యము నిరాకరించితినని కోపగింపఁకుఁడు.

గీ. తొల్లి నాయొనరించిన దుష్కృతంబు
గర్భదాసుని గావించెఁగాదె నన్ను
నీభవంబున సైత మి ట్లే యొనర్చి
యేమి కాఁబోవు వాఁడనో యింక నేను.

శకా—అట్లయిన నేను జెప్పిన పని జేయనందువా?

స్థావ—బాబూ! చేయఁజాలను. యీ ఘోర యుద్యమమునుండి విరమించుటయే శ్రేయస్కరము.

శకా—ఏమీ! నీకుఁ గూడఁ గొమ్ములు వచ్చినవా? ఈనాఁటితో నీ యుద్యోగమునకు స్వస్తియైనది వెడలి పొమ్ము.

స్థావరకుఁడు కండ్ల నీరు గ్రుక్కుకొనుచు నావలకు వెడలిపోయెను.

శకారుఁడు కావలసిన వారు మాటనిరాకరించుటచే ద్విగుణీకృతమగు కోపము గలవాఁడయ్యెను. రాజుగారి బావ మఱఁది కావున నదివరకుఁ దనయాజ్ఞ లప్రతిహతముగఁ జెల్లు చుండెడివి. అసలు క్రోతి కల్లుద్రావిన యవస్థ పట్టెను. వసంతసేన జుట్టుపట్టుకొని తానే చంపఁబోయెను. వసంతసేనయొక్క దీనాతిదీనములగు దృష్టులను జూచి విటుఁ డడ్డమువచ్చి నా ప్రాణము లున్నంతకాల మీమెకు హానికలుగనీయ ననియెను. విటుఁడు దగ్గరనున్నంతకాలము తన ప్రయత్నము కొనసాగదు. తెలివిదెచ్చుకొని శకారుఁ డింకొక క్రొత్తయెత్తు నెత్తెను. విటునితో "బావా! నేనుమాత్రము దుర్మార్గుఁడ ననుకొంటి వా? నాకుమాత్రము పరలోకమనిన భయములేదా? దీనిని జడిపించి వశపఱచుకొనుటకు మాత్రమే యిట్లు చేయుచుంటిని గాని మల్లకప్రమాణం బగు కొలంబునఁ బొడమి స్త్రీహత్య కొడిఁగట్టుకొందునా! నేను దీనిని జంపను నిశ్చయము. నీవు నమ్ముమని యొట్టు బెట్టుకొని యీగర్భదాసికి నాయందు నిజ ముగఁ బ్రేమయున్నను నిన్నుజూచి సందేహించుచున్నది. ఎంత భోగముదియైనను నింకొక పురుషుఁడు దగ్గఱనుండఁగ నొకనితో రహస్యకృత్యములకు సమ్మతించునా! ఒక్కింత తడవు నీవా వలకుఁ బొమ్ము! నే నీమెను బ్రసన్నురాలిని జేసికొందు" నని

బ్రతిమాలుకొనియెను. శకారుఁడు నిజముగాఁ బ్రేమగలవాని వలె నటించుచుండుటచే విటుఁడు వీనికి నిజముగా మోహము తలకెక్కినది. కాముకులు ప్రేమించిన వారియెడల నకృత్యమ్ము లొనరించుటకు సాహసింపఁజాలరని నమ్మి యబలను దిక్కులేని దానను నీవే యిప్పట్లు నన్ను రక్షించుటకు సమర్థుఁడవు. ఈన గాచి నక్కలపాలుసేయకుము. ఇంతవఱకును నన్నుఁ గాపాడి యిప్పు డీరాక్షసునిచేతి కప్పగించి పోవకుమని వసంతసేన యాక్రోశించుచు బతిమాలుకొనుచున్నను వినిపించుకొనక కను చాటగు ప్రదేశమునకు వెడలిపోయెను.

దైవముపై భారమువైచి వసంతసేన గడగడ వడం కుచు నిలువఁబడియుండెను. శకారుఁ డామెదరికిఁ జేరి మరల ననేకవిధముల నాసగొల్పెను. కాని లాభము లేకపోయినది. పటీరవృక్షము నాశ్రయించినదానఁ బలాశవృక్షచ్ఛాయ నాకు రుచించునా యని వసంతసేన మరల వాని దిరస్కరించెను. శకారుఁడింకఁ గోపమ్ము నిలుపుకొనఁజాలక రెండు చేతుల నామె గొంతుఁ బిసికెను. ఆమెయు మూర్ఛితురాలై క్రిందఁ బడి పోయెను. ఇంతలో విటుఁ డుద్యోగము వలదనుటచే వెడలి పోయిన స్థావరకుఁ డెచ్చటనుండెనో వెదకి శకారుఁ డేమి దుర్మార్గమును దలపెట్టుచుండెనో దగ్గఱనుండిన మంచిదని వానిఁగూడ నిచ్చటికిఁ దీసికొనివచ్చు సరికీ దృశ్యము కండ్లఁ బడినది. శకారునిపై మితిలేని యాగ్రహ ముదయించి చంప

నొంచెఁ గాని చిరకాల సహవాసమే యాతని వెనుకడుగు వేయించెను. ఈ దుర్మార్గుఁ డిచ్చటనున్నచో నపరాధమంతయు నాయందే మోపఁగలఁడు. ఇఁక నీపట్టణమును వీడిపోయి ముందు రాజుకాఁబోవు నార్యకు నాశ్రయించుట మంచిదని నిశ్చయించుకొని,

"సీ. దాక్షిణ్యబలముసఁ దరులు ముంచుచుఁ బాఱు
పోడవుశేరా యెండి పోతి వయయొ ?
తనలోకము ద్యజించి చనుదెంచిన రతీ స
తీ ! పోతివటవె స్వదేశమునకు !
అడుగంటిపోతివా యకట సౌభాగ్య ర
త్నాకరమా ! మన్మథాపణంబ !
చిఱిన విసుము తిన్నె చిన్నె గైకొన్న సౌ
జన్య నదీపూర్ణ చంద్రవదన !

గీ. నగలు మెయినిండఁ బూని మందగతి మీఱ
నొలుకు సింగారమునఁ జేర్మి చిలుకనీవు
నడచి యే తెంచుటింకఁ గన్పడకయుండఁ
జేసెనే మాలపెనువేల్పు చెయ్యి యకట !"

యని వసంతసేన కొఱకు విచారించుచుఁ బరమదుర్మార్గుఁడగు శకారుని వీడి తన మనోభీష్టమగు తావునకుఁ బోవు దారి పట్టెను.

శకారున కిప్పటికి మనస్సున భీతిదోఁచెను. తనమీఁదికే యుపవాద రాకుండ విటుఁడు దాఁటుటచేత నిఁక నీయకృత్యమునకు రెండవసాక్షియగు స్థావరకునివలనఁ దనకే ప్రమాదమును రాకుండఁ జేసికొనుటకై వానిని బంధింపనెంచి నేనిప్పుడే వచ్చెదను. నాకొఱకుఁ బ్రాసాదాగ్రప్రతోళికయందు వేచియుండుమని పంపివైచి వసంతసేన యింకను బ్రతికియున్నదేమో నని మఱల మఱలఁ బరీక్షించి శవ మెవ్వరికంటను బడకుండ నచ్చట రాలియున్న పండుటాకుల నామెపైఁ గప్పి యిఁక నీ నింద నాపై లేకుండ నధికరణమునకుఁ బోయి చారుదత్తునిపై నభియోగము దెచ్చెదననియు నిశ్చయించుకొని,

గీ. చారుదత్తుని దేహనాశంబు కొఱకుఁ
దగిన నూతన కపట మీఁపగిదిఁ గాన
యాగపశువును జంపించినట్లు నేఁడు
దారుణంబుగఁ జంపింతుఁ జారుదత్తు.

నని సంతసింపుచు నెవ్వరేని దన్నుఁజూతు రనుభయమ్మున సగము పడిపోయిన ప్రహరిగోడ దూకి వెలువెడలెను.

శకారుఁడిచేఁ దన్నులుతినిపోయిన బౌద్ధశ్రమణకుఁ డెల్లెట్లో కాషాయవస్త్రము నుదికికొని చెట్టుకొమ్మ కారఁ గట్టిన వానరములు చింపివేయునేమో ననియు నేలపై నారవైచిన మట్టి యంటుకొనుననియు సందేహించుచు వసంతసేనపైఁ

గప్పఁబడియున్న పండుటాకుల దరి కఱుదెంచెను. ఆకులు కదలుచుండుటయు నిట్టూర్పు సవ్వడి వినవచ్చుటయుఁ గాంచి యతఁడు భయోద్రేకంబున నటమటించుచుండఁ గొంత మూర్ఛదెలిసి వసంతసేన చేయిఁజాచెను. అదిచూచి యాకు గుంపు గదిపి యిదివర కామెవలన మహోపకారమును బొంది యున్నవాఁడు గావున గుర్తించెను. క్రమముగఁ గొంత తెలివి వచ్చి యామె దాహమని సన్న జేయ దాపున నెచ్చటను నీర ముంగానక యచ్చటనున్న కాషాయార్ద్రవస్త్రమును మీఁదఁ గప్పెను. ఆమెకుఁ బూర్ణముగఁ దెలివివచ్చినది. పిదప బౌద్ధ సన్యాసి తన్నామె కెఱిఁగించుకొని సేవచేర్చుటకై దగ్గఱనున్న బౌద్ధవిహారమునఁ దనకు ధర్మభగినియగు నొక సన్యాసిని యున్నదని తెల్పి యామె నచ్చటకు గొనిపోయెను.

---

# మృచ్ఛకటికము.

## నవమ ప్రకరణము

మఱునాఁటియుదయముననే లేచిశకారుఁడు కాలకృత్యములు నిర్వర్తించుకొని వసంతసేనాహత్యాపవాదమును జారుదత్తునిపై మోపి తనమార్గమును నిష్కంటక మొనర్చికొనుటకై త్వరపడుచు నధికరణమంటపమునొద్దకుఁ జేరికొనియెను, అధికరణికు లింకను రా లేదు. సేవకుఁడు మాత్రము మంటపము నూడ్చుచుండెను. శకారుఁడు కొంతసే పిటునటు బిచ్చియెత్తినకుక్క వలెఁ దిరుగాడుచుండఁగ నధికరణికులు వచ్చి న్యాయపీఠము నలంకరించిరి. అంతట శకారుఁడు తా నొక కార్యార్థినై వచ్చితి నని లోనికిఁ గబురంపెను. వీనికిఁ బ్రతిదినము నేదియో యొకయుపద్రవమును గొనితెచ్చు టాచారమగుటచే మొట్టమొదటనే నీవిన్నపమును వినుటకు వీలులే దని యధికరణికులు నిరాకరించిరి. చేయునది లేక శకారుఁడు మాఁ బావగా రగుపాలక మహారాజునకుఁ జెప్పి మీయుద్యోగము లూడ దీయింతు నని బెదరించెను. అన్నంతయుఁ జేయఁ

గలఁ డని వారు భయ పడి లోనికి రానిచ్చిరి. శకారుఁ డంతట గతదినమునఁ బుష్పకరండక జీర్ణోద్యానమునఁ జారుదత్తుఁడు వసంతసేనను హత్య చేసినాఁ డనియుఁ దాను కనులారఁ జూచితి ననియు నభియోగమును మోపెను. అంతట నధికరణికులు చారుదత్తునకుఁ గబురంపిరి.

వసుహీనుఁడై పశ్చిమాద్రికిఁ జేరఁబోవు చున్న భాస్కరునకుఁ జరమకాల మంతయు నున్నకాంతితోఁ గాలక్షేపము సేయుటకు యోగము కుదిరినది కాదు. శత్రుజీమూత పటలములు ప్రబలములై యాక్రమింపసాగినవి. చారుదత్తుఁడును పుట్టినది మొదలు పరోపకారములఁ జేయుట యందే నాజీవితమును గడపుచుంటిని గాని యెన్నఁడు నేరికి నపకారమును దలపెట్టియైన యెఱుంగనే? పాలక మహారాజు మాత్రము నానడవడియు నాసువృత్తము నెఱుంగఁడా? అధికరణికులు నన్నేల పిలువ నంపినారో? ఏదురాత్ముఁడైన నాశకటముపై నాయకుఁడు తప్పించుకొని పోవుచుండఁ జూచి నాపై నీయభియోగమును దెచ్చియుండరు కద యని వితర్కించుకొనుచు ఘోరమృత్యుసూచకము లగుదుర్నిమిత్తములకుఁ గంపించుచు న్యాయస్థానమును జొచ్చెను.

చారుదత్తుఁడు శకారునిజూచి మఱింత యుద్వేగము నొందెను. పిదప వసంతసేనాహత్యాభియోగ మాత్రనికిఁ దెల్పఁ

బడెను. చారుదత్తుఁడు కలలోనైన నిట్టియపవాదము సంభవించు నని తలంచియుండలేదు. పిడుగు మొత్తినట్లు నిర్ఘాంతపడి దైవమా నీ కేమి యపచార మొనరించితి నిట్టియపవాదమును దెచ్చి పెట్టితి వేల యని దుఃఖించుచుండ నధికరణికు లాతని వసంతసేనవిషయమై ప్రశ్నించిరి. వసంతసేనకుఁ దనకుఁ దేవాలయములోఁ బరిచయ మైనదిమొదలు తనయింటినుండి యామె వెడలిపోయినంతవరకు జరిగినవృత్తాంత మంతయుఁ దెల్పి మిగిలినసంగతి యేమియు నే నెఱుఁగ నని చెప్పెను. ఇంతలోఁ జందనకునిచేఁ దన్నులు దిని పరాభవఖిన్నమానసుఁ డైనవీరకుఁ డఱుదెంచి తా నార్యకుని వెదకుచుండఁగ రాజమార్గమునఁ జారుదత్తుని బండి పోవుచున్న దనియుఁ జందనకుఁ డాబండిని బరీక్షించి యందుఁ బుష్పకరండకజీర్ణోద్యానమునకుఁ బోవుచున్న వసంతసేన యున్న దని తడఁబడుచుఁ జెప్పె నదున దానును గూడఁ బరీక్షింపఁ బోవునంతలో నిందు వసంతసేనయే యున్న దార్యకుఁడు లేడు నేను పరీక్షించితిని నీకు నమ్మకము లేదా యని తన్నుఁ దన్నె ననియు నభియోగము దెల్పుకొనెను. చారుదత్తుఁడు విచారముచేత నవమానముచేతఁ గ్రుంగిపోవుచుండెను. చారుదత్తునిమీఁద సాక్ష్యము బుజువగుచున్నందుల నధికరణికుఁడు గూడ నగచి పుష్పకరండకజీర్ణోద్యానమున నొక స్త్రీ చచ్చిపడియుండెనో లేదో చూచిర మ్మని వీరకున కాజ్ఞాపించెను. వీరకుఁ డచ్చటికిఁ బోయి యచ్చటఁ బ్రోవుపడి

యున్న యాత్రికులగుంపు జూచి వచ్చి నిశ్చయముగ నట నొక స్త్రీ చచ్చి పడియున్న దని తెల్పెను.

చారుదత్తుఁ డేమి చేయుటకుఁ దోచక చింతాసాగర నిమగ్నుఁడై రోహసేనునకు సువర్ణశకటము జేయించుకొను మని వసంతసేన యిచ్చిన యాభరణముల నామె కిచ్చివేయవలయు నని పంపిన మైత్రేయుఁ డింకను రాలేదే యాతఁడు వచ్చినచో వసంతసేనవిషయ మంతయు స్పష్టముగఁ దెలిసి యుండును గదా! ఈశకారుఁడు తెల్పిన దంతయు నిజ మగునా యని వితర్కించుకొనుచుండెను. ఇంతలో మైత్రేయుఁ డామార్గముననేఁ బోవుచు హత్యానేరమునకై చారుదత్తుఁ డధికరణమంటపమునకుఁ గొనిరాఁబడె నని విని యడలుచు నచ్చటికి వచ్చెను. వసంతసేనయొక్క నగలమూట మైత్రేయుని చంక యందే యుండెను. ఉద్విగ్నుఁడై యున్నచారుదత్తునివలన వసంతసేనాహత్యాపవాదము తనపై శకారునిచే మోపఁబడిన దని విని కోపముచే నోడలెఱుంగక మైత్రేయుఁడు శకారునితో వివాదమునకు డీకొనియెను. శకారుఁ డూరకొనక కారులు ప్రేలుటచే మైత్రేయునకు మఱింతయాగ్రహము గల్గి వానిని జంపవల దని చారుదత్తుఁడు వారించుచున్నను జేతిలోని కఱ్ఱ నెత్తెను ఈసందడిలో మైత్రేయునికక్షాంతరమునుండి వసంతసేన నగలమూట క్రిందఁ బడెను. అంతట శకారుఁ డొక్కగింతు వైచి యవిగో వసంతసేననగలు. ఆమెను జంపి వైచి ధనము లేకుండుటచే నవి

విక్రయించుట కీదుర్మార్గుఁడు మైత్రేయునిచే నంగడికిఁ బంపు చున్నాఁడని గగ్గోలుఁ గావించెను. న్యాయాధికారులు వసంత సేన తల్లికిఁ గబురంపిరి. ఆమె యరుదెంచి గోలుగోలున నేడ్చుచు నానగల నొక్కొక్కటి తీసి పరీక్షించి యవి వసంత సేన వేయని సాక్ష్య మిచ్చెను.

అన్నియు వ్యతిరేక మైనవి తుదకుఁ బ్రాణమిత్రుఁ డగు మైత్రేయుఁడు మిత్రునియాపదకు వెతజెంది తెచ్చుకొనిన కోపముగూడ నాతనికి హానిగనే పరిణమించినది. ఎన్నివిధముల నమ్మింపఁ జూచినను నెన్ని యొట్లు పెట్టుకొనినను న్యాయాధి కారులు చారుదత్తునిమాటలను నమ్మలేదు దైవము వ్యతిరేక మైనప్పు డెవ్వ రేమి చేయుదురు న్యాయాధికారు లంద ఱాలో చించి చారుదత్తుఁడే హంత యని నిర్ణయించిరి. కొలఁది వేయ వలయు ననునాజ్ఞ పాలకమహారాజు యొక్క సన్మతి కొఱకుఁ బంపఁబడెను. మహారాజును వసంత సేన నెవ్వఁడు చంపెనో వాని కామెనగలనూట మెడయందుఁ గట్టి యూరేగించి దక్షిణ శ్మశానమునందు శూలారోపణము జేయుఁడని యాజ్ఞయిచ్చెను. చారుదత్తుఁడు తనను సంభవించినని శ్వేతుకాపదలకుఁ గన్నీరు మున్నీరుగా నేడ్చుచు స్త్రీహంతకుఁ డనుపేరు వడుటకంటె నిట్టి చావే మంచి దని నిశ్చయించుకొనెను.

చారు—మిత్రమా! మైత్రేయా! వసంత సేన పరమపదించిన దని యిందు మూలముగా ధృవమైనది. నే నామె

మృతికిఁగారకుఁడ నైనను గాకున్నను యీ దుర్భరమైన నిందను భరించి యెవరి కోసము జీవింతును? నాకు విధింపఁబడిన యీ శిక్షన్యాయ మైనదే. నీవేగిమదేక ప్రాణమై జీవించియున్న నా జననికి నాకు మారుగఁ గడసారి వందనము లర్పింపుము.

మైత్రే—ఇట్టి దురవస్థసంభవించు నని కల యందైన నే నను కొననై తిని. మిత్రమా! చిన్నతనమునుండి నన్ను రక్షించుచున్న నీ మృతికి నేనేకారకుఁడ నైతినిగదా?

చారు—ఏమి చేయఁగలము. దైవమిట్టి కుతంత్రములఁ బన్ను చుండఁగ మనుష్యమాత్రులము మన మేమి చేయఁగలము.

మైత్రే—ఇట్టి ప్రాణమిత్రుని నిన్నుఁ బోగొట్టుకొని నేను మాత్రము జీవింపఁగల్గుదునా? నేనును నీతోడనేవచ్చి ప్రాణత్యాగ మొనర్చెదను నను గ్రహింపుము.

చారు—మిత్రమా! ఇది యేమివెఱ్ఱి? నాకొఱకైనను నీవు తప్పక జీవింపవలసి యున్నది.

మైత్రే—అదియేమి? నన్నెందులకు జీవింపుమని శాసించెదవు?

చారు—మదేకపుత్రుఁ డగు రోహసేనుని నీవు పోషించి రక్షించ వలసియున్నది. వానికి నీకంటె రక్షకులెవ్వరును లేరు. ఎప్పుడును మిత్రవాక్యము నెదిరించి మెఱుంగని వాఁడ వీనాఁడు మాత్ర మట్టి పనిజేయుదు వని నేను తలంపను.

మైత్రే—మొదలు విఱిగిపడిన వృక్షమును శోషించిన మాత్ర మేమి ప్రయోజనమేమి?

చారు—సర్వశాస్త్రము లెఱిఁగినవాఁ డవుగదా! మిత్రమా! మైత్రేయ! నీవు గూడ నిట్లు పల్కుచుంటివేమి! పుత్రులు లేనిదే పితరులకుఁ బుణ్యలోకములు సున్న.

గీ. పుణ్యలోకంబు లందున్న పురుషులకు శ
రీరముల మాఱట సుమీ కుమారుఁ డనఁగ
నీకు నా యందుఁ గల పేర్మి నా కుమారు
నందు జూపించి వానిఁ గాపాడుమయ్య.

మైత్రే—మిత్రమా! నీ వెన్ని చెప్పినను నిన్ను విడిచిపోవుటకు నాకు బుద్ధి పుట్టుట లేదు.

చారు—గ్రహచారమును తప్పించుకొన నేరము. ఈ రూపము గ్నైన నీ మిత్రుని ఋణమును దీర్చుకొనుము.

మైత్రే—అట్లయిన నీ యిష్టము.

చారు—నెచ్చెలీ! మాటమాట! ప్రాణావసానసమయము గావున నా కుమారు నొకమారు తీసికొని వచ్చి నాకుఁ జూపించుము. నీవు నాకుఁ జేయవలసిన యుపకార మితకు మించి లేదు. వేగమేగి వానిని దీసికొని రమ్ము.

చారుదత్తుని యాజ్ఞ వడసి మైత్రేయుఁ డింటికి వెడలిన తరువాతఁ ద్వారగర మ్మను చున్న తలారులవెంటఁ జారుదత్తుఁడు దక్షిణ శ్మశానవాటికకుఁ బయనమయ్యెను. శకారుని సంతస మునకు మితియే లేదు తాను జేసిన యపరాధమును దన గర్భ శత్రువుతలపై మోపుట యందు జయము గాంచితిఁ గదా యని యపరిమితానందమును గాంచుచు నాతని చావు గూడ దగ్గఱ నుండి యీక్షించి కృతకృత్యుఁడ నయ్యెద నని శకారుఁడును వెంటనే బయలుదేఱెను.



# మృచ్ఛకటికము.

## దశమ ప్రకరణము

గీ. సుజన శకుంతాధివాసమై సొంపుఁ గాంచి
ఖ్యాతిఁ గాంచిన యొకసజ్జనాగమంబు
నఱకుచున్నార మిదె కాల పరశుధారఁ
జూచుచున్నారిదేలొకో చోద్య మరల.

జనులారా! దారియిండు తొలంగుఁడు మార్గమధ్యమునఁ దొలంగుఁడు నృపాపథ్య మొనరించు వారలకుఁ గ్రూరకర్మములఁ జేయు వారలకు నిట్టికఠిన శిక్షలే తప్పక విధింపఁ బడును. మీర లందఱును బుద్ధికలవారలై పాపకార్యముల జోలికిఁ బోవక న్యాయముగఁ బ్రవర్తింతురుగాక' యని చాటింపుచు నిరువురు చండాలురు గన్నేరుం బువుదండ గంఠమునవైచి యూరేగింపుచుఁ జారుదత్తుని దక్షిణ శ్మశానమున నున్న వధ్యస్థానము నకుఁ గొనిపోవు చుండిరి. హఠాత్సంభవమైన యీవృత్తాంత మాలించి యుజ్జయనీ నగరమందలి ప్రజలందఱు నేల యీనిన ట్లావైపునకే వచ్చి పడుచుండిరి. సాటిమానవుని జంపుటకుఁ గొనిపోవుచుండ నిచట నేమివింతఁ జూచెదరు మీకుదయాధర్మ

ములు లేవా? దారికడ్డము రాకుఁడు తొలంగినచో శిక్షింప వలసి వచ్చునని రాజభటు లదలించుచున్నను జనులు గుంపులు గుంపులుగా వచ్చి చూచి చారుదత్తునకుఁ గడసారి యశ్రుని మీలితలోచను లై నమస్కరించి వెడలి పోవనివారే లేరు. ఆమహానుభావుని నామప్రభావ మటువంటిది సజ్జనులకు దైవవశ మున నాపదలు వచ్చిన నాఁడు వగవని కఠినహృదయు లుండరు. "రామ! రామ! తనకున్న సర్వస్వమును ధారవోసి యెందరి కెన్ని యుపకారములు చేసినాఁడు ఆచిరసుకృతమైన నీయాపద నుండి వీనిని రక్షించుటకు శక్తిమంతము కాక పోయెనే" యను వారును, "సర్వజన మాననీయతఁ గాంచిన పుణ్యాత్ముఁడు వధ్యపశువుగా మారిపోయెనే" యినువారును, "యెంతసుకృత వంతుఁడైన నేమి? ఎంటి ధర్మాత్ముఁడైన నేమి? మానవుఁడై పుట్టరాదు. మానవదేహి కెంతటిమతి మంతున కైనను గష్టములు రాక మానవను రను, "ఛీ! ఛీ! యుక్తాయుక్త వివేచన జ్ఞానములేక దుర్మార్గుడగు పాలకమహారాజింక దుండగ మొడి గట్టెనా? వానికేమి చేటు మూడ నున్నదో" యనువారును, "మనమేమి చేయఁ గలము రాజసలే దుర్మార్గుఁడు మనమాటలు వినినచో రాజభటులు మనకుఁ గూడ ముప్పు గల్గింతు" రను వారును, "మశిపూస వంటివానికి మసిబొగ్గుతో నేటికి సంబంధము సంభవించెను కటకటా! కుటిలస్వభావు రాండ్రగు వారకాంతలఁ దడవిన వారికిటువంటి కష్టములు తప్పవను వారును,

గీ. కీడ్పడిన మీఁద జనుఁడు సుఖింపవచ్చుఁ
గటికచీఁకటిలో దివ్వెఁ గాంచినట్లు
మేలనుభవించి పిదప లేమి వడెనేని
వాఁడు నిజముగ జీవచ్ఛవంబు చూవె!

ఈమహానుభావుఁడు దరిద్రుఁడై జీవించుట కంటె మరణించుట యేశ్రేయస్కరము కానియీదుర్మరణము మాత్రము శోచనీయమనువారున్నై చూడ వచ్చిన జనులందఱును బరిపరి విధముల నాడుకొనుచుఁ గంటనీరు వెట్టుకొనుచుండిరి. మేమందఱ మీతని వలన నంతయో యింతయో యుపకారములను బొందియుంటిమి అల్పులమగు మేమీ విపత్సమయమున నీతనికిఁ బ్రత్యుపకారముజేయఁ జాలక పోయితిమిగదా! మామనః పూర్వక ప్రార్థనమాలించి యీమహానుభావునకు నీచారుదత్తునకుఁ బరలోక సౌఖ్యమైనను గావింపుమని భగవంతున కాప్తులగువారు మ్రొక్కుచుండిరి. చారుదత్తునకై పలవించుచు వెనువెంటనే వచ్చుచున్న జనుల కన్నీటి ధారలచే ధరాపరాగ మడఁగి పోయెను. స్త్రీ లందఱును వీథి వెంబడి నూరేగించుచుఁ దీసికొని పోవుచున్న చారుదత్తుని వాతాయనార్గళిమ్ములై ముఖములతో నెంత వాని కెంత గతి పట్టినదో యని యడలుచుఁ గన్నీటి బిందువులచే నకాలవర్షాగమమును సూచించిరి. చండాలురును బ్రతి ఘోషణస్థానము నొద్ద డిండిమము వాయించుచుఁ జారుదత్తుఁ డొనర్చిన యపరాధమును దానికై మహారాజు

విధించిన శిక్షయుఁ దెలుపుచు నెవ్వరే నిట్టి యుండ దిక్కి దుష్కార్యము లాచరించుచో నిట్టి కఠిన శిక్షయే యనుభవింపఁ గలరు. కావున జాగ్రత్త వహింపుఁడని సాటింపుచుఁ జారు దత్తుని గొనిపోవుచుండిరి.

నిరపరాధియు సుగుణవంతుఁడు మఱియు నగు చారు దత్తుఁ డీదృశ్యము నంతయుఁ జూచుచు సహింపలేక దుర్మార్గుఁ డగు విధి చెయిదములను దూషించుచుఁ బరాభవభారముచే ఖిన్నుఁడై కన్నుల వెంబడి బాష్పములురలుచుండ దీనాతిదీనము లగు దృష్టులతోఁ దన్నుఁ జూడ వచ్చిన జనుల నాలోకించుచు నిట్లు వాపోవఁ దొడంగెను.

ఉ. స్కంధమునందు శూలమును గంఠమునన్ గరవీరమాలహృ
ద్బంధితమైన శోకమును దాలిచి పోవుచునుంటి మార్గణ
గ్రంధము విన్నచోటికి వికారముగా శమిత ప్రబంధ సం
బంధముకల్గుచోటికి సవంబునఁబోయెడు మేకచాడ్పునన్.

గీ. ముఖశతాలంకృతంబైన మకుటమున
కార్యసాధ ఖ్యాతి యిడితిఁ జైత్యాదికముల
మరణదశయం దశదృశ మనుజు లకట
నన్నుఁ బాపిగ సాటించుచున్నవారు.

ఇట్లు దుఃఖించుచుండ రోహసేనుని దీసికొని మైత్రేయుఁడు జనుల మధ్యనుండి యతికష్టముతో దారి జేసికొనుచుఁ జారు

దత్తుని సమీపించెను. తన కొఱకు కేడ్చుచున్న కుమారుని జూచి దుఃఖము పొంగిపొరలి వచ్చుచుండ నెట్టకేల కాపుకొని. కష్టకాలమున దరిజేరిన కుమారున కేమొసంగుదునా యని దీర్ఘముగ నాలోచించి పుత్రుని నంకతలమునఁ గూర్చుండఁ బెట్టుకొని యాతని కన్నీరు దుడిచి "నాయనా! రోహసేన! నీ తండ్రి వలెఁ గాక నీవు జాగరూకుఁడవై యాగతానాగతముల విమర్శించుకొనుచు జీవింపుము. ఈ మైత్రేయుఁడే నీకును నాకును గూడ రక్షకుఁడు. నాకుమారుగ మైత్రేయుని జనకునిగా భావించుకొనుము. కులమర్యాద లతిక్రమింపకుము. సన్మార్గులపై నకారణముగ దాడి వెడలి వారల కాపద లొనరింపఁ జూచువా రనేకు లుందురు. దుర్జనుల కదిసహజ స్వభావము. అట్టివారల నెన్నడు నే గూడియుండకుము. పున్నరకమునుండి నన్నుద్ధరింపజనించిన పుత్రుఁడ వగు నీ విచ్చు నివాపజలంబులే నాకుఁ బరలోకమున కాధారము. ఇదిగో యజ్ఞోపవీతము విహితకర్మానుష్ఠానమున నెన్నడును వెనుకంజ వేయవలదు సుమా యని బోధించి తన మెడ యందున్న యజ్ఞోపవీతమును దీసి బాలున కలంకరించి చిరాయుష్మంతుఁడవై వర్ధిల్లుమని మనసార దీవించెను.

నిరపరాధి యగు నా తండ్రిని వదలి యాతని బదులుగ నన్ను జంపుఁడు. పితౄణము నీవిధముగఁ దీర్చికొందునని రోహసేనుఁడును, నా మిత్రుని గరుణాళులరై వదలి వేసి

నన్నురిదీయుఁడు మిత్రకార్యమునకై యసువుల దొఱంగిన విఖ్యాతి నాకుఁ జేకూర్పుఁ డని మైత్రేయుఁడును దీనాతిదీనముగ గోలపెట్టుచుండఁ గ్రమముగా నూరేగింపు శకారుని ప్రాసాదము నొద్దకు వచ్చెను.

తన రహస్యమును వెల్లడించి తన కెచ్చట ముప్పు గల్పించునో యని నాఁడు దుర్మార్గుఁ డగు శకారుఁడు తన కొఱకుఁ బ్రాసాదా గ్రప్రతోళికయందు నిరీక్షించు చుండుమని యాజ్ఞాపించి యింటికి వచ్చిన యనంతరము స్థావరకుని నిగళ బద్ధుని గావించి యామేడపై నుంచెను క్రింద జండాలుర చాటింపు విని స్థావరకుఁడు "ఏమేమీ ! సకలజన పూజితుండును సతత సన్మార్గవర్తనుఁడు నగు చారుదత్తుఁడా వసంతసేనను జంపినది. ఔరా! మీయవివేకముకాల! అందుకొఱ కాతని నురిదీయుచుండిరా ! ఛీ! ఛీ! ఏమి న్యాయస్థానములు ఏమి న్యాయాధిపతులు దున్నయీనిన దనిన దూడను గట్టివేయుఁ డనుటయేనా మీన్యాయ పరిపాలనము. ఇట్లె నిరపరాధు లగు నెందఱి ప్రాణములను వీరిపొట్టఁ బెట్టుకొను చున్నారోగదా ? భగవానుఁడా నీవెందణఁగి పోయితివి. ఒకఁడు చేసిన నేరమున కింకొకఁడు శిక్షార్హుఁడా ! నీకేయింతటి విచక్షణా శక్తి యున్నప్పుడు మానవదేహధారులగు నీన్యాయాధిపతులను నిందించుట యెందులకు ? పరమచండాలుఁ డగు శకారుఁ డంతటి ద్రోహమున కొడి గట్టి నాఁడా ? నేనెట్లైన నీమహానుభావున కుపకార మొనరించి తీరవ

లయు నని యోజించి గొంతెత్తి వసంతసేనను జంపిన వాఁడు శకారుఁడుగాని చారుదత్తుఁడు కాఁడు. అన్యాయముగ నొకనిర పరాధి జీవములను హరింపకుఁడు సాక్ష్య మిచ్చుటకు నేను సిద్ధ ముగ నుంటినని కేకవైచెను. కాని పాపమాతఁ డేమిచేయును సంకుల మగు నాజనసమూహము యొక్క కోలాహలమునం దెచ్చటనో మేడమీఁదనున్న యాతని కేక లెవ్వరికి వినిపించును? జనసమూహము క్రమముగా ముందునకు సాగిపోవు చుండెను తన కేక లెవ్వరికిని వినబడకుండుట గ్రహించి స్థావరకుఁ డిఁక నూరకున్నచో లాభ మిసు మంతయు నుండదు నిష్కారణముగ నీసజ్జనుఁడు మడియును. నామాట కేమి? సకలార్థి జనకల్పభూజ మగునొక మహాత్ముని రక్షించుటకు నావంటి యల్పుని ప్రాణ ములు పోయిన మాత్రమేమి? ప్రపంచమున కేమిలోటని నిశ్చ యించుకొని నిగళబద్ధుఁ డయ్యుఁ దెగించి మేడమీఁది నుండి క్రిందకు దుమికెను. దుమికుట తోడనే దైవానుగ్రహము వలన నిగళములూడి పోయినవి. స్థావరకుఁడు వెంటనే చండాలుర యొద్దకుఁ బరువెత్తుకొని పోయి యాదినుండి యంతము వరకుఁ బూసగ్రుచ్చినట్లు వసంతసేనా హత్యా వృత్తాంతము నెఱిఁ గించెను. అప్పుడు తానొనర్చిన మహాకార్యమునకు సంత సింపుచుఁ జారుదత్తుని వధ గన్నులారఁ జూడవలయునని వచ్చిన శకారుఁడచ్చటనే యుండెను. స్థావరకుని జూచుట తోడనే శకా రునిమీఁది ప్రాణములు మీఁదికెగిరిపోయెను. కోపముచే నొడ

లంతయుఁగంపించెను భయముచే నొడలంతయుఁ జెమటపట్టినది. కాని తత్క్షణమే తెలివి దెచ్చుకొని ధైర్యమువహించి శకారుఁడు నాయనా! చేట! ఈవిపత్సమయమున నీవు నామాన ప్రాణములు రక్షించినచో నీ కాజన్మాంతమును గృతజ్ఞుఁడనై యుందును. నీకెంతయో మేలు సమకూర్చెదనని రహస్యముగఁ బలికి కొంత బంగారమును స్థావరకుని చేతిలోఁ బెట్టెను. కాని స్థావరకుఁడు నిరాకరించెను. రాజస్యాలకుఁ డిఁకఁజేయునది లేక యింకొక యెత్తునెత్తి వానిచేతిలో నున్న బంగారము నూడలాగికొని యంకటికిని జూపి ఈగర్భదాసుఁడు నాయింటిలో బంగారమును దొంగిలించినాఁడు అందుచేత వీనిని మేడమీఁద శృంఖలాబద్ధుని గావించి వచ్చితిని. ఎట్లు తప్పించుకొని వచ్చినాఁడో కాని యాకారణముచే నామీఁదఁ బగఁ దీర్చుకొనుటకిట్లబద్ధ మాడుచున్నాఁ' డని తెల్పెను. జనులందఱును నిజమే కాఁబోలు నని స్థావరకుని బలు విధముల దూషించిరి. శకారుఁడు సామంతుఁడు ఈలోకము ధనమూలము. ధనమునకుఁ జలామణి యున్నట్లు దేనికిని నుండదు పలువురును ధనవంతుఁ డబద్ధము లాడుచున్నను నమ్ముదురుగాని ధనహీనుఁడు సత్యమును పల్కుచున్నను నమ్మరు. అందునను సేవానైచ్యము. ఇంక స్థావరకుని మాటలను నమ్మువారెవ్వరు? నాచేత నైనంతయు శక్తివంచన లేకుండఁ బ్రాణములకైన నాసింపక చేసితిని. నామాటలను వీరు నమ్మకున్నచో నమ్మింపఁ దగిన సాధన

మానామొద్ద లేదు. ఈ ఘోరకృత్యమునకు రెండవసాక్షియగు విటుఁడెచ్చటికేగెనో తెలియుటలేదు. ఇఁక సాధనమేమి ? భగవంతుఁడు గూడ నాప్రయత్నముల కంతరాయమును గలిగించుచున్నప్పు డూరకుండవలసినదే నని లోపలననుకొని పాపము స్థావరకుఁడు గ్రుడ్లనీరు గ్రుక్కుకొన సాగెను. నిర్భాగ్యుఁడనగు నాపై జాలివహించి నాకు సహాయము జేయ వచ్చిన వారికిఁ గూడ నీదృశమగు పరాభవము సిద్ధించుట న్యాయమేనని చారుదత్తుఁడు మఱింతగ విచారించెను.

ఇంకను నాలస్యమొనరించిన యెడలఁ దన పాపకృత్యమునకు సాక్షులగు వారెవ్వరే నఱుదెంచి చారుదత్తుని విడిపింతురేమో నను భీతిచేఁ ద్వరగఁ గొఱతవేయుఁడని శకారుఁడు చండాలురను హెచ్చరించెను. చండాలు రిరువురి యందును వీరకుఁడను వాఁడొకఁడు. వానికిఁ దండ్రి తన మరణసమయమున "నాయనా! నీకుఁ గూడ నావంటి యుద్యోగమే వచ్చునెడల నెవ్వరినైన వధింపవలసివచ్చినప్పుడు నిర్ణీతకాలముననే గాక మఱియొక ముహూర్తము వేచి చంపు చుండుము. ఏమందువా ? ఎప్పుడైన నే సాధుపుంగవుఁడైన దయవహించి వధ్యుఁడగు వానిని ధన మొసంగి విడిపించ వచ్చును. రాజునకుఁ గుమారుఁడు కల్గుచో నా మహోత్సవ కాలమున నందఱికిని విడుదల కావచ్చును. లేదా రాజు మారి పోయినచో నప్పు డందఱకు ముక్తి కలుగవచ్చును. అదియును

గాక పోయిన జనసామాన్యవిప్లవములు బయలుదేఱవచ్చును.
ఇంకఁలకు భిన్నముగ నీవు నడచుకొనినచో మాతాపితృగతు
లకుఁ దప్పినట్లే !' అని యుపదేశించి యొట్టు బెట్టించుకొని
యెను. వీరకుఁ డీవిషయమును రెండవవానికిఁ దెల్పి యెవ్వరికి
వంతు వచ్చునో చీట్లు వైచి కొంద మనియెను. వీరకునకే
వంతు వచ్చి నందున శూలారోపణము ముహూర్తకాలమపోంపు
చేయఁబడెను.

బౌద్ధవిహారమున సంవాహకునకు ధర్మభగినియగు
నామె చేసిన సేవలవలన వసంతసేనకుఁ బూర్తిగ బలము కలిగి
నది. సంవాహకుఁ డీక నామెను దీసికొని పోయి చారుదత్తుని
యింట దిగఁబెట్టుటయే యుక్తమని తలంచి వెంటఁబెట్టుకొని
రాజమార్గమున వచ్చుచుండెను. చండాలుర ఘోషణమును విని
వారలిద్దరు నదియేమియో తెలిసికొనవలయునని వడివడిగ
నడచి వచ్చుచుండిరి కొంతదూరమరుగు నప్పటికి నిజమెఱింగిరి
వసంతసేన తన మూలమునఁ బ్రియుఁడు మడియుటకు సిద్ధముగ
నుండె నని వగచి యెట్లైన రక్షించుకొనవలయునని సంవాహకుని
బ్రేరేచి శక్తి కొలఁదిఁ బఱువెత్తుకొని వచ్చుచుండిరి. వీరకుఁడు
గడువుకోరిన ముహూర్తకాలమును గడచి పోయెను. శకారుఁ
డిఁక నొక్క క్షణమైన నాలస్యము చేయుటకు వీలుకాదని
తొందర గొల్పుచుండ వీరకుఁడు చారుదత్తుని వెల్లకిలఁ
బరుండఁబెట్టి శకారుని యాదేశము ప్రకారము శూలారోప

మును మాసినవైచి తలఁ దఱుఁగుటకే నిశ్చయించుకొని కత్తి నెత్తెను. కాని వానిచేతినుండి కత్తి జారి పోయెను. ఇది యపశకునము మనము రాజాజ్ఞయే నెరవేర్చుదము. భగవత్కృపచేఁ జారుదత్తున కీయాపద తప్పిపోవునేమో యని వారలిరువురు నంతసించుచు శూలారోపణమునకై యత్నింపఁదొడఁగిరి. ఇంతలో భిక్షుక వసంతసేన లిరువురు వలదువలదని వారించుచువచ్చిపడిరి. వసంతసేన యొక్క యెదటనుఁ జారుదత్తుని కౌఁగిటిలోఁ జిక్కుకొని ప్రియసఖా! నేను జీవించియేయుండగా నాకొఱకై ప్రాణత్యాగ మొనర్చుట న్యాయమేనా యని దుఃఖింపసాగెను. వసంతసేనను జూచినతోడనే శకారుఁడు పిడుగు మొత్తిన వాని చందమున నిశ్చేష్టుఁడై కొంత వడికిఁ దెలివి దెచ్చుకొని తన పాపము బ్రద్దలైనందులకు వగచి యాత్మరక్షణమునకై పాఱిపోవఁ దొడఁగెను. ఈ సంగతిని గని పెట్టి చండాలు రిరువురును వానిని బట్టుకొనుటకై వెన్నంటిరి.

గీ. మృత్యుముఖముననే నున్న యపుడు నీవు
తరలు కన్నీటఁ గుచములఁ దడుపుకొనుచు
బ్రతుకఁగాఁ జేయ నెటనుండి వచ్చినావు
వెఱపు పుట్టింపఁగా మంత్ర విద్యవోలె.

వని చారుదత్తుఁడు సంతోషాతిరేకముచే నామెను బ్రశ్నింపఁగా వసంతసేనయు బండ్లు తారు మారగుటచేఁ దాను శకారుని

యుద్యానమునకుఁ బోవుట మొదలు మరల భగవదనుగ్రహ ముచే బౌద్ధసన్యాసి యైన సంవాహకుఁడు తన్ను రక్షించుట వరకును దెల్పి ప్రాణావసాన సమయమందుఁ బ్రాణేశ్వరుని రక్షించుకొనఁ గల్గితినిగదా యని భగవంతునకుఁ గృతజ్ఞతా పూర్వక నమస్కారముల నర్పించెను. అనాథ నాథుఁడగు నింది రారమణుని నమ్మిన వారికేనాఁటికిని నాపదలుండఁ జాలవని చారుదత్తుఁడు నాదయాముయున కంజలి బంధించెను.

పాలకమహారాజుపైఁ బ్రజల దఱకు నవిశ్వాస మధికమై యార్యకుని సేనానివత్యముున నాతనిపై దండెత్తి యజ్ఞవాటిక యందుండఁగాఁ జంపివైచిరి. ఇంతవరకు నార్యకునకు సహాయ మాచరించు చున్న శర్విలకుఁడు చారుదత్తు నురిదీయుట కాజ్ఞ యయ్యెనన్న సంగతి నాలించి యాతని ప్రాణమునెట్లైన రక్షించి తన కృతజ్ఞతను జూపుకొన వలయు నని త్వరగనే తెంచెను. ఆతఁడు వధ్యస్థానమును జేరుకొనునప్పటికి జారుదత్త వసంతసేన లిరువురు నమందానందమునలోలాడుచుండిరి. ప్రజలు జరిగిన సంఘటనములనుతలంచుచు సంతోషార్ద్ర తరంగములనూగా డుచుండిరి. ఇంతలోఁ జండాలురు శకారుని బంధించితీసుకొనివచ్చి చారుదత్తుని యెదుటఁ బెట్టిరి. ఇట్టి యవాంతరములకు గారకుఁ డైనరాష్ట్రియస్యాలకునకుఁ దగిన శిక్షవిధించుట తప్పదని శర్విల కుఁడు కోరుచున్నను, బ్రజలందఱు నీపాపాత్మునకుఁ జారుదత్తు నకే శిక్షవిధింపఁబడెనో యదియే తగినదని త్వర బెట్టుచున్నను

సహజోదార స్వభావుఁడగు చారుదత్తుఁడు విరోధియైనను హింసింపకుండుటయే తగిన శిక్ష యని శకారుని వదలివై చెను.

భర్తృశిక్షావార్త చెవిఁబడినంతటనే తాను బ్రతికి యుండుట నిరర్థకమని తలంచి చారుదత్తుని యిల్లాలగు ధూతాంబ చితిఁ బేర్పించుకొని కుమారుఁడగు రోహసేను "డమ్మా! నన్ను దిక్కుమాలిన వానిఁ జేసి తండ్రితోపాటు నీవును నన్ను వదలి వైచెదవా" యని యేడ్చుచుఁ జీర చెరఁగు లాగుచున్నను, మైత్రేయుఁడు తల్లీ! కుమారుని మొగము జూచి యైన నీ వీసాహసమును మానుమని బోధించుచున్నను వినిపించుకొనక యగ్నిజ్వాలయందుఁ బ్రవేశింప నెంచుచుండెను. ఈ సంగతి చారుదత్తునకుఁ దెలిసినది. అతఁడును విచారాతిశయముచే నితికర్తవ్యతామూఢుఁడై నిశ్చేష్టుఁడై యుండ నాలస్య మొనర్చినచో ధూతాంబ తమకు దక్కదనియుఁ దరువాత విచారించి లాభముండదనియుఁ దలపోసి శర్విలకుఁడు ధైర్యము దెచ్చుకొని చారుదత్తు వచ్చుటకిఁ గొంపోయెను. చారుదత్తునిఁ గాంచినతోడనే ధూతాంబ సంతసించి ప్రాణత్యాగ ప్రయత్నమును మానివైచెను. జీవితేశ్వరు బ్రతికించి నాకు మరలఁ జూపించితివి నీ యంత పుణ్యాత్ములు లేరని ధూతాంబయుఁ బ్రాణేశ్వరు శిక్షావార్త చెవిఁ బడినంతనే జీవములఁ బాయఁదలచిన నీ పాతివ్రత్యము సంస్తవనీయమని వసంతసేనయు నన్యోన్యమును, గొండాడుచుఁ బరస్పరముఁ గౌఁగిలించుకొనిరి.

శర్విలకునితో నాలోచించి చారుదత్తుఁడు తన కుపకార మొనరింపనెంచిన చేటుఁడగు స్థావరకునకు దాస్యవిముక్తి నొనరించెను. ఆర్యకుఁడు సులభముగాఁ దప్పించుకొనుటకుఁ గారకుఁడైన చందనకునకు దండపాలకాధికార మీయఁబడి రాష్ట్రియస్యాలకుని స్థానమున నియమింపఁబడెను.

శా. చారిత్రంబు పవిత్రమయ్యె, రిపుఁడస్మత్పాదములప్పట్టె మ
త్తారాతిన్ బరిమార్చి యార్యకుఁడు రాజయ్యెన్ సుహృ
న్మౌళి, త, స్వీరత్నంబగు ప్రేయసిన్ జెలిమికానిన్ నిన్నుఁ
గన్గొంటి నేఁ, గోరంగాఁదగు నట్టి దేది యిఁక నాకుం
జెప్పుమా ! మిత్రమా !

అని సంతోషితస్వాంతుఁడై చారుదత్తుఁడు శర్విలకుఁతో వచించి భగవద్విలాసము నీపగిది నుతించెను.

ఉ. కొందఱి లోచొప్పెనర్చు మఱికొందఱి హెచ్చొనరించుఁ
గొందఱిన్, గుందఁగఁజేయుఁ గొందఱి కనూనముదంబు
ఘటింపఁజేయు ని, ట్లుందఱి కన్నిరీతుల మహావ్యసనోదయ
ముల్పొనర్చుచు, న్నందునఁ జెప్పుచుండ్రు విధి కందఱు
నేతఫుఁగుండ న్యాయమున్.

సమాప్తము.

---

